Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 50 • 16-12-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## ఎమ్మెస్‌రెడ్డి మనకికలేడు!

సినీ నిర్మాత, రచయిత, మహా కవి, సాహిత్య విమర్శకుడు అన్నింటికీ మించిన మంచి మనిషి మల్లెమాల సుందరరామరెడ్డి మరణించారు. 11వ తేది హైదరాబాదులోని తన స్వగృహంలో సంపూర్ణ జీవన సాఫల్యంతో రాముడి పాదాలచెంతకు చేరిపోయారాయన.

ఎమ్మెస్‌రెడ్డి జీవితం భావి తరాలకొక పాఠ్య పుస్తకం వంటిది. కృషి ఉంటే మనుషులు ఋషులౌతారనే నానుడికి ఆయనొక సజీవ తార్కాణం. ఎక్కడో వెంకటగిరి కొండ క్రింద పల్లెలో కటిక పేదరికంలో పుట్టి, పొట్ట పొడిస్తే అక్షరం ముక్క రానివాడిగా బాల్యం గడిపిన వ్యక్తి ఆయన. కానీ తెలుగు సినీ ప్రపంచానికి మకుటంలేని మహారాజుగా వెలుగొంది, రామాయణ మహాకావ్యాన్ని అచ్చ తెలుగు పదాలతో ఆంధ్రీకరించింది కూడా ఆయనే. ఈ పరిణామక్రమంలో ఆయన తిన్న ఎదురు దెబ్బలు, సాధించిన ఘన విజయాలు తెలుసుకొంటే ఆశ్చర్యం కల్గుతుంది. ఎమ్మెస్‌రెడ్డి ఎక్కడున్నా, ఏ పనిచేసినా సంచలనమే. సినిమా

కొరవ 14వ పేజీలో

# కోర్టులతో రాజకీయ క్రీడ!

- **చంద్రబాబు, జగన్‌లు తమ రాజకీయ కక్షలకు న్యాయ వ్యవస్థను భ్రష్టుపట్టిస్తున్నారు.**

మన దేశంలో ఇప్పటికీ ప్రజావిశ్వాసం కోల్పోని ప్రజాస్వామిక వ్యవస్థ న్యాయస్థానం ఒక్కటే. సుప్రీంకోర్టు నుంచి దిగువస్థాయి బెంచ్ మెజిస్ట్రేట్ వరకు జనం కోర్టులంటే నమ్మకం చూపుతారు. రాజకీయ బురద అంటని ఏకైక వ్యవస్థ కూడా అదే. కానీ దురదృష్టవశాత్తు మన రాష్ట్రంలో రాజకీయ వాదులందరూ తమ కక్షలు తీర్చుకోవడానికి, ఒకరి మీద మరొకరు పైచేయి సాధించడానికి న్యాయస్థానాలను విశృంఖలంగా వాడుకొంటున్నారు. నిత్యం కోర్టులలోనే కాపురం చేస్తున్నారు. ఢిల్లీ నుంచి గల్లీ వరకు ఏ కోర్టులో చూసినా ఆంధ్ర రాజకీయ వాదుల వ్యాజ్యాలే. ఒకదాని మీద మరొకటి, దాని మీద ఇంకొకటి, ఆ రెండింటికి అదనంగా వేరొకటిగా కేసులు దాఖలౌతున్నాయి. చిత్ర విచిత్రమైన న్యాయ వివాదాలు సృష్టిస్తున్నారు. సుప్రీం కోర్టు, హైకోర్టు బార్ అసోసియేషన్లలో పేరున్న ప్రతి సీనియర్ న్యాయవాదికీ చేతినిండా పని. వారి ఫీజుల కోసం ఎన్ని కోట్లు ధారపోస్తున్నారో లెక్కే లేదు. వారిచ్చే ఫీజులకు ఆశపడి న్యాయవాదులు కూడా కొత్త కొత్త లీగల్ పాయింట్లు వెతికి పడుతున్నారు. వాటి మీద కొత్త కొత్త కేసులు అల్లుతున్నారు.

జగన్ అక్రమ ఆస్తుల మీద మంత్రి శంకరరావు వ్రాసిన లేఖ ప్రజా ప్రయోజన వ్యాజ్యంగా హైకోర్టు ముందుకు రావడంతో మొదలైంది ఈ అవాంఛనీయమైన పోటీ. కొంతకాలం తనను తాను న్యాయవ్యవస్థ చక్రబంధం నుంచి కాపాడుకోవడానికి ఒంటరిగా ప్రయత్నం చేశాడు జగన్. కానీ అది అసాధ్యమని అర్థం కావడంతో దాని వల్ల ప్రజలలో తానొక అవినీతిపరుడిగా ముద్రపడే పరిస్థితి కన్పించడంతో ప్రతిదాడికి పూనుకొన్నాడు. తన శత్రువులందరినీ ఒకటిగా కట్టకట్టి అందరి మీద న్యాయపరమైన దాడులకు దిగాడు. చంద్రబాబునాయుడు జగన్‌కు ప్రధాన రాజకీయ శత్రువు. రేపటి ఎన్నికలలో కాంగ్రెస్ కంటే, తెలుగుదేశం నుంచే తనకు కీలక పోటీ జరుగుతుందన్నది ఆయన అంచనా. దానితో అవినీతి పరుడనే ముద్ర తనతోపాటుగా చంద్రబాబు మీద కూడా రుద్దితే తప్ప ఎన్నికల ప్రచారంలో తన శత్రువు నోరు మూయించలేమన్న వ్యూహంతో తన తల్లి విజయమ్మ ద్వారా ప్రజా ప్రయోజక వ్యాజ్యం దాఖలు చేయించాడు. చంద్రబాబుకు రాజకీయంగా, మీడియా పరంగా, ఆర్థిక పరంగా అండదండలు అందించే కీలక వ్యక్తులందరినీ ఈ కట్టలో కలిపేశాడు. సుజనా చౌదరి, నామా నాగేశ్వరరావు, మురళీమోహన్, సి.ఎం.రమేష్, ఈనాడు రామోజీరావు... ఇట్లా చంద్రబాబుతో ఏదో ఒక రకమైన సంబంధాలున్న వారందరినీ కేసులలో ఇరికించాడు. దానితో ఈయన మీద ఆయన, ఆయన మీద ఈయన పైచేయి సాధించడానికి వ్యూహప్రతివ్యూహాలు పన్నుతున్నారు. అందుకు న్యాయ స్థానాలను వేదికగా చేసుకొంటున్నారు. హైకోర్టుకైతే వేరే పనే లేకుండా పోయింది. సుప్రీంకోర్టులో పేరున్న ప్రతి సీనియర్ న్యాయవాదీ హైదరాబాదులోనే తిష్టవేసి ఉన్నాడిప్పుడు.

కొరవ 14వ పేజీలో

# జల జగడం

భవిష్యత్తులో జరగనున్న యుద్ధాలన్నిటికీ నీళ్ల సమస్యే మూలమౌతుందని చెప్పిన పెద్ద మని షెవ్వడో కానీ, ఆ మాట అక్షరాలా నిజంగా మారుతున్నది. నీటి కొరతతో నిత్యం సతమతమయ్యే తమిళనాడు రాష్ట్ర పరిస్థితే అందుకొక ఉదాహరణ. కావేరి జలాల విషయంలో కర్నాటకతో జగడం, తెలుగుగంగ నీటి కోసం ఆంధ్ర ప్రదేశ్‌తో వివాదం, ఇప్పుడు తాజాగా పెరియార్ నదిలోని నీళ్ల కోసం కేరళతో కలహం. విచిత్రమైన జల జగడం ఇది.

కేరళ, తమిళనాడు సరిహద్దులలో, సముద్ర మట్టానికి మూడు వేల అడుగుల ఎత్తున పెరియార్ నది ప్రవహిస్తున్నది. దాని పరీవాహక ప్రాంతమంతా కొండలు, అడవులు. అందువల్ల ఆ నీరు కేరళకు ఏ రకంగానూ ఉపయోగపడదు. కానీ దాని వెనుక భాగంలో, తమిళనాడుకు చెందిన మధుర, శివగంగ, రామనాథపురం వంటి జిల్లాల దాహార్తిని ఈ నది నీటితో తీర్చే అవకాశం వుంది. ఇవన్నీ పూర్తిగా వర్షాధారంపై ఆధారపడే మెట్ట ప్రాంతాలు, నిత్య కరవుతో అల్లాడే శాపగ్రస్త ప్రాంతాలు. రెండువందల ఏళ్ల నాడే పెరియార్ నది విశిష్టతను గుర్తించారు బ్రిటీష్ ఇంజనీర్లు. ఎన్నో పరిశీలనలు, పరిశోధనల తర్వాత 1885లో ఆ నీటిని సద్వినియోగం చేసే ప్రణాళిక సిద్ధమైంది. పశ్చిమ కనుమల నుంచి పడమట దిశగా ప్రవహించి, అరేబియా సముద్రంలో కలిసిపోయే ఈ నదీ ప్రవాహాన్ని తూర్పు దిక్కుకు దారి మళ్లించి, బంగాళాఖాతంలో కలపాలన్నది ప్రణాళిక. అయితే అందుకోసం నిర్మించవలసిన ఆనకట్ట ప్రదేశం ఆనాటి తిరువనంతపురం మహారాజు పాలనలో వుంది. దానితో ఆయన్ను ఒప్పించి, 8వేల ఎకరాల భూమిని 999ఏళ్లపాటు బాడుగకు తీసుకొన్నారు. కాల్చిన ఇటుకల పొడి, చక్కెర, బెల్లం, కాల్షియం ఆక్సైడ్ కలిపిన మిశ్రమం, సున్నపు పొడులతో బ్రహ్మాండమైన ఆనకట్ట నిర్మించారు. ఆ నీటిని సొరంగమార్గంలో తరలించి, మధురై జిల్లాల్లో ప్రవహించే చిన్న వాగు వంటి వైగై నదికి జత చేశారు. దానితో పెరియార్ నది మళ్లింపు జరిగిపోయింది. దాదాపు రెండున్నర లక్షల ఎకరాలు బంగారు పండే మాగాణులుగా మారాయి. గత 116 ఏళ్లుగా తమిళనాడు రైతులు ఈ నీటిని వాడుకొంటున్నారు. ఆనకట్ట వుండేది, అది జలాశయంగా నెలకొన్నది, పెరియార్ నది ప్రవహించేది పూర్తిగా కేరళ భూభాగంలో. కానీ కేరళలో ఒక్క ఎకరా భూమి కూడా ఆ నీటితో సాగు కాదు. ఒక్క గ్రామానికీ ఆ నీటితో త్రాగు నీరు ఇవ్వలేరు. అదే ఈ ఆనకట్ట విచిత్రం.

అయితే కేరళవాసులు ఇప్పుడీ ఆనకట్టను కూల్చి, కొత్తది కట్టాలని ఆందోళన చేస్తున్నారు. అందుకువారు చెప్పే కారణం, 116 ఏళ్లనాటి పురాతన ఆనకట్ట బలహీనపడిపోయింది కాబట్టి, వరద తాకిడికి అది కూలిపోతే కేరళ రాష్ట్రంలోని దాదాపు మూడు జిల్లాల ప్రజలు జల సమాధి అయ్యే ప్రమాదం వుందని. గుజరాత్‌లో జరిగిన మోర్వి ఆనకట్ట ప్రమాదాన్ని ఇందుకొక నిదర్శనంగా చూపుతున్నారు వారు. కేరళ వాసుల అభ్యంతరాలను పరిశీలించిన సుప్రీం కోర్టు, ఆనకట్టలో నీటి మట్టాన్ని 142 అడుగుల స్థాయి నుంచి 136 అడుగులకు తగ్గించాలని ఆదేశించింది. ఈ తాత్కాలిక ఉపశమనం చాలదని, ఆనకట్టను పూర్తిగా నిర్మూలించాలని కేరళ ప్రజలు ఉద్యమం చేస్తున్నారు. అయితే తమిళనాడు ప్రభుత్వం మాత్రం, ఆనకట్టకు ప్రమాదం లేదని, దాన్ని ఆధునిక ఇంజనీరింగ్ ప్రక్రియ ప్రకారం పటిష్టంగా తీర్చి దిద్దుతామని వాదిస్తున్నది. ఈ వివాదం చిలికి చిలికి గాలి వానగా మారి, రెండు రాష్ట్రాల ప్రజల మధ్య ఘర్షణ వాతావరణాన్ని సృష్టిస్తున్నది. ఉభయ శాసన సభలూ తమకు అనుకూలంగా తీర్మానాలు చేసి, సుప్రీం కోర్టులో కేసు నడుపుతున్నాయి.

ఒకపక్క జీవనాధారం, మరొకప్రక్క అసలు జీవితానికే ప్రమాదం. ఎవరి వాదన సమర్థించాలో తెలియని అయోమయం. ఉభయ పక్షాలూ ఒకరి సమస్యను మరొకరు సానుకూలంగా అర్థం చేసుకొని, పెద్ద మనసుతో పరిష్కారానికి దారి వెతికితే తప్ప ఈ జలజ్వాల చల్లారదు. కానీ రెండు ప్రక్కలా వున్నది రాజకీయవాదులు కావడంతో, వారి దృష్టి కోణం ఓట్ల మీద మాత్రమే వుండడంతో రోజు రోజుకీ సమస్య జటిలంగా మారుతున్నది. కేంద్ర ప్రభుత్వం పెద్ద మనిషిగా మధ్యవర్తిత్వం చేస్తే తప్ప దీనికి ముగింపు లభించడం కష్టం. ఉభయ రాష్ట్రాల ప్రజల మధ్య విద్వేష భావాలు పెచ్చరిల్లక మునుపే కేంద్రం ఆ చొరవ చూడడం అవసరం.

జమీన్‌రైతు

## జనవాణి

### పెన్నచేసిన పాపమేమిటి?

నదీమ తల్లుల పేర్లు అన్ని ప్రాంతాల్లో అమ్మాయిలకు పెట్టే సాంప్రదాయం మన దేశీయులకు ఉంది. గంగ, తపతి, నర్మద, కావేరి, కృష్ణ నదుల పేర్లు పలువురికి ఉంటాయి. కానీ మన నెల్లూరును ఆనుకొని ప్రవహిస్తూ లక్షలాది మంది కడుపునింపే 'పెన్న' పేరును మాత్రం ఎవరూ పెట్టుకున్నట్లు కనపడదం లేదు. దీనికి గల కారణమేమిటో నాకైతే అర్థం కావడం లేదు.

తూపిలి వనమాలి — నెల్లూరు

### స్థానిక సంస్థల ఎన్నికలు పెట్టాలి!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిపై చంద్రబాబు నాయుడు ప్రవేశపెట్టిన అవిశ్వాస తీర్మానం వీగిపోయింది. కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం క్రమంగా కుదురుకొంటుంది. మునిసిపల్ మంత్రి మానుగుంట మహీధర్‌రెడ్డి వచ్చే ఏడాది మార్చిలోపల స్థానిక సంస్థల ఎన్నికలు నిర్వహిస్తామని ప్రకటించారు. నెల్లూరు కార్పొరేషన్, గూడూరు, కావలి, వెంకటగిరి మునిసిపాలిటీల్లో పాలక వర్గాలు లేక అధికారులు ఇష్టారీతిన వ్యవహరిస్తున్నారు. గత పాలకులు స్థానిక సంస్థలను దోచుకతిన్నారు. ఈసారైనా స్థానిక సంస్థలకు నీతి నిజాయితీగల వారిని ప్రజలు ఎన్నుకొంటే బాగుంటుంది.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

### ప్రభుత్వానికి చట్టాలు వర్తించవా?

ఒకడు ఎవరి దగ్గరైనా అప్పుచేస్తే మూడేళ్లలోపు దాన్ని తీర్చాలి. మూడు సంవత్సరాల కాలపరిమితి మించితే ఆ ప్రామిసరీ పత్రం చెల్లుబాటు కాదు. దానికి విలువ లేదు. అదే ప్రభుత్వం మాత్రం చేస్తే చెల్లుబాటు అవుతుందా? ప్రభుత్వం ప్రతి సంవత్సరం విడుదల చేస్తున్న ప్రామిసరీ పత్రాలంటే డబ్బు (కరెన్సీ) చాలా ఏళ్లు చలామణిలో వుంటుంది. ఈ కరెన్సీని మూడేళ్లు మాత్రం చలామణిలో ఉండేటట్లు ఉత్తర్వులు జారీచేస్తే 'నల్లధనం' మటుమాయమవుతుంది. దేశంలో అన్ని వస్తువుల ధరలు అదుపులోకి వస్తాయి. ఆర్థికవేత్త అయిన దేశ ప్రధాని మన్మోహన్‌సింగ్ ఈ విషయమై ఆలోచన చేయకపోవడం బాధాకరం.

వి.వరమ్మ — నెల్లూరు

### సమాచారం అందించండి!

విశ్వోదయ గౌరవ జీవిత సభ్యత్వం స్వీకరించేందుకు కవి, సినీ రచయిత, నటుడైన తనికెళ్ల భరణి కావలి వచ్చినట్లు 'జమీన్‌రైతు'లో వచ్చిన వార్త చదివి సంతోషించాను. విశ్వోదయలో చదివిన విద్యార్థులు దేశవ్యాప్తంగా వివిధ హోదాల్లో పనిచేస్తున్నారు. ఇటువంటి సమాచారాన్ని విశ్వోదయ నిర్వాహకులు కొరవ 14వ పేజీలో

---

## 70 ఏళ్ల క్రితం ఈవారం

19-12-1941
పేజీలు : 10 వెల: అణా

### సూళ్లూరుపేట

26వ తేది కలియుగ భీమ శ్రీ సత్యనారాయణ గుప్త గారి ఆధ్వర్యాన వ్యాయామ సంఘం స్థాపించబడెను. దీనికి మంజులూరు చెంచు రాఘవులు శెట్టిగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి.

### గూడూరు

12వ తేది హైస్కూలు పెద్ద పంతులు ఆధ్వర్యాన జరిగిన సభలో 30 సంవత్సరాలు సేవించి ఉద్యోగము నుండి విరమించుకున్న తెలుగు పండితులు కృష్ణమాచార్యుల వారికి ఉపాధ్యాయ వర్గము, విద్యార్థి వర్గము సన్మాన సమర్పణము చేసిరి

***

పాత విద్యార్థి సంఘం వారు ఉదారోపేతంగా ఇస్తామన్న స్కాలర్‌షిప్పులు ఏవి? అవి ఇస్తారని మిగతా షిప్పులన్నీ ఎగజేసినవి.

### మన్నేపల్లి రామకృష్ణారావు అస్తమయము

సుబోధిని పత్రికాధిపతులును, వివిధ గ్రంథకర్తలును, దేశ సేవానిరతులును, మా మిత్రులునునగు మన్నేపల్లి రామకృష్ణారావు గారు కొంత కాలము మంచము పట్టి యుండి 14వ తేది దివంగతులైనారు. 30 సంవత్సరాలుగా నెల్లూరు పురములో వీరు కల్పించుకొని సేవజేయని ప్రజాసంస్థ లేదు. పంతులవారి ఓర్పు, పట్టుదల, సేవానిరతి, నిరంతరోత్సాహము, ఆదర్శప్రాయములు. అవసాన కాలమున వీరికి సంభవించిన దుఃఖ పరంపరలకు వీరు బలియైరనిన అతిశయోక్తి కాదేమో.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

15-12-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పేద రాజాజీకి ఏడు యాన సౌకర్యాలు

మాటకు ముందు కాంగ్రెస్‌కు కోట్ల నిధులున్నాయని, తమ పార్టీ దరిద్రంతో క్రుంగిపోతున్నదని ప్రజలను నమ్మించజూచే రాజాజీ ఇటీవల ఉత్తర దేశ యాత్రలో తన ప్రయాణానికి సప్తవిధ వాహనాలను ఉపయోగించాడట. అవి విమానం, హెలికాప్టరు, పడవ, పల్లకి, జీపు, కారు, రైలు. హజారీబాగ్ పార్టీ మహాసభకు రాజాజీ రాంఘర్ మహారాజా హెలికాప్టరులో పోయి వాలినాడట. భారతదేశంలో ఈ స్వాతంత్ర్య పార్టీ రాజాకి తప్ప వ్యక్తిగతంగా ఎవ్వరికీ హెలికాప్టరు లేదు. పాపం! రాజాజీ పార్టీ ఎంత పేదదో చూడండి!!

### నెల్లూరుముచ్చట్లు

### పెనుబర్తి సోదరులకు ఉరిశిక్ష రద్దు!

24-4-1961 నెల్లూరు తాలుకా పెనుబర్తిలో జరిగిన వెడిచర్ల రామరాఘవరెడ్డి హత్యకు సంబంధించి ఆయన సోదరులు కృష్ణారెడ్డి, వెంకట్రామరెడ్డి గారలకు నెల్లూరుజిల్లా సెషన్సు జడ్జి సమియుద్దీన్ మహమ్మద్ 3-10-61 తేది విధించిన ఉరి శిక్షలను రద్దుచేస్తూ, ముద్దాయిలను నిర్దోషులుగా విడుదలచేస్తూ అప్పీలును విచారించిన ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులు జగన్మోహన్‌రెడ్డి, చంద్రశేఖర్ శాస్త్రి గారలు 13వ తేది తీర్పు చెప్పారు.

మొదటి రిపోర్టు(ఎఫ్ఐఆర్) ఆలస్యంగా ఇచ్చుటలో ప్రాసిక్యూషన్ ఇచ్చిన సంజాయిషీ విశ్వసనీయంగా లేదని న్యాయమూర్తులు వెలిబుచ్చారు. 1, 2, 3, 4 ప్రాసిక్యూషన్ సాక్షుల సాక్ష్యాన్ని గూడా న్యాయమూర్తులు నమ్మలేదు. ప్రత్యక్షంగా చూచిన వ్యక్తి సాక్ష్యము, వైద్య నివేదిక విభేదిస్తున్నదని పేర్కొన్నారు. సందేహ రహితంగా ప్రాసిక్యూషన్ నేరాన్ని రుజువు చేయలేక పోయిందని న్యాయమూర్తులు పేర్కొన్నారు.

# నెల్లూరు ముచ్చట్లు

## చలికాలంలో కరెంట్ కోత ఏమిటి?

నెల్లూరులో చలి జనాలను వణికిస్తుంది. కానీ ఈ కాలంలోనూ జనాలు విద్యుత్‌ను విపరీతంగా వినియోగిస్తున్నారంటూ ట్రాన్స్‌కో విద్యుత్ కోత వేళలను పెంచుకొంటూ పోతుంది. ఉదయం 7 గంటల నుంచి 9 వరకు, మళ్లీ మధ్యాహ్నం ఒంటి గంట నుంచి మూడు గంటల వరకు విధిస్తున్న విద్యుత్‌కోత వేళ చాలదంటూ 13వ తేది నుంచి చీకటి పడ్డాక మళ్లీ గంటపాటు కోత విధిస్తుంది. నగర పరిధిలో రాత్రి 6.30 నుంచి 7.30 వరకు, శివారు ప్రాంతాల్లో 7.30 నుంచి 8.30 వరకు కొత్తగా విధిస్తున్న విద్యుత్ కోతకు చిరెత్తుతున్న జనాలు ట్రాన్స్‌కోతో పాటు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వ తీరుపై దుమ్మెత్తి పోస్తున్నారు.

## నెల్లూరులో సింగీతం!

నెల్లూరీయుడు, ప్రఖ్యాత సినీ దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు 11వ తేది నెల్లూరు వచ్చారు. నాగభైరవ కోటేశ్వరరావు స్మారకంగా కవి రసరాజుకు అందించిన అవార్డు ప్రదానోత్సవ సభలో పాల్గొన్నారు. ఆ రోజు ఉదయం హోటల్‌లో తనను కలిసిన విలేకరులతో ఆయన మాట్లాడుతూ తనలో రచయిత, దర్శకునికి వివిఆర్ కాలేజీలో చదువుకొనే రోజుల్లోనే బీజం పడిందన్నారు. నెల్లూరులో దుర్భా రామ్మూర్తి శిక్షణ, సినీ పరిశ్రమలో దర్శక దిగ్గజం కెవిరెడ్డి దగ్గర పనిచేయడం తన జీవితాన్ని మార్చి వేశాయన్నారు.

## రోడ్డు ప్రమాదంలో గాయపడ్డ డాక్టర్లు!



తుక్కు తుక్కయిన డాక్టర్లు నడిపిన కారు.

నెల్లూరు నగరంలో పేరుగాంచిన డాక్టర్లు సి.శ్రీధర్‌రెడ్డి, జడ్.శివప్రసాద్, పి.మల్లిఖార్జున, సి.మల్లిఖార్జున 11వ తేది రాత్రి పొద్దుపోయాక మినీ బైపాస్ రోడ్డులోని అనిల్ గార్డెన్ సెంటర్‌లో జరిగిన రోడ్డు ప్రమాదంలో గాయపడ్డారు. వీరిలో చర్మవ్యాధుల స్పెషలిస్ట్, షిర్డిసాయి రూరల్ వెల్ఫేర్ ఫౌండేషన్ నిర్వాహకుడు సి.శ్రీధర్‌రెడ్డి తీవ్రంగా గాయపడడంతో తొలిరోజు నారాయణ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌లో వైద్యం అనంతరం ఆయన్ను చెన్నైకు తరలించారు. మిగతా ముగ్గురు డాక్టర్లు స్వల్పగాయాల మధ్య కోలుకొంటున్నారు. సరస్వతీనగర్‌లోని ఐఎంఏ హాలు నుంచి స్విఫ్ట్ కారులో బయలుదేరిన డాక్టర్ల బృందం విచిత్రంగా ప్రమాదానికి లోనయ్యింది. వీరి ప్రమాదం జరగక ముందే ఇక్కడ మరో రెండు ప్రమాదాలు జరిగి ఉండడంతో ఆ గత్తరలో డ్రైవింగ్ చేస్తున్న డాక్టర్ శ్రీధర్‌రెడ్డి బ్రేక్ వేయబోయి ఎక్సలేటర్‌ను నొక్కడంతో ప్రమాద తీవ్రత పెరిగింది. అరగంటపాటు ఓ ట్రాక్టర్ తీవ్రంగా లాగితే కానీ కారు డోర్ రాలేదు. ట్రాఫిక్ ఎస్ఐ బల్లి రవిచంద్ర అర్థరాత్రి సమయంలో బాగా శ్రమించి క్షతగాత్రులను తన జీపులోనే నారాయణ హాస్పిటల్‌కు తరలించినట్లు ప్రత్యక్ష్య సాక్షులు చెప్పారు. సేవాధృక్పథంతో పనిచేసే ఈ డాక్టర్లు త్వరగా కోలుకోవాలని ఆకాంక్షిద్దాం.

## 18మంది అయ్యోర్లపై వేటు

ఏళ్ల తరబడి విధులకు హాజరు కాకుండా సొంత వ్యాపారాలు, ఇతరత్రా వ్యాపకాల్లో మునిగి తేలుతున్న 18 మంది సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయులను సర్వీసు నుంచి తొలగిస్తూ విద్యాశాఖ చర్యలు చేపట్టింది. ఎన్నో ఏళ్లుగా వీరు పాఠశాలలకు రాక పత్తాలేకుండా పోవడంతో విచారించగా ఇలాంటి వారు జిల్లాలో 49 మంది తేలారు. వారిలో మొదటిగా 18 మందిపై వేటు వేశారు.

## జక్కాను కలసిన ప్రసన్న

కోవూరు ఉప ఎన్నికల బరిలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా ఉన్న నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి సిపిఎం అగ్రనేత జక్కా వెంకయ్యను కలిశారు. నెల్లూరులోని ఆయన నివాసంలో వెంకయ్యను కలసిన ప్రసన్న ఎన్నికలలో తనకు అండదండలు అందించాలని కోరారు. వెంకన్న ఆశీస్సులు అందుకొనేందుకు ప్రసన్నకుమార్‌రెడ్డి సమావేశమైనట్లు చెప్తున్నారు. కానీ వెంకయ్య అంత సులభంగా లొంగే మనిషి కాదు కదా!

## బ్యాంకు వద్ద చోరీ

నిత్యం రద్దీగా ఉండే మద్రాస్ బస్టాండ్ వద్ద గల ఐసిఐసిఐ బ్యాంకు వద్ద ఒక వ్యక్తి నుంచి నగదు తస్కరించిన ఘటన సంచలనం కల్గించింది. డిసెంబర్ 9వ తేదీ ఆత్మకూరుకు చెందిన కొండారెడ్డి అనే వ్యక్తి బ్యాంకు నుంచి 3.80 లక్షలు డ్రాచేసి వస్తుండగా అక్కడ వున్న కొందరు వ్యక్తులు కింద చిల్లర పడిందని చెప్పగానే అతను ఆ డబ్బులు తీసుకొంటుండగా కారులో పెట్టి ఉన్న నగదును అపహరించుకుని వెళ్లినట్లు సమాచారం.

## పంచాయితీలపై భారం

అసలే అంతంతమాత్రంగా ఉన్న పంచాయితీల నిర్వహణపై భారం మోపుతూ రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. ఇక నుంచి పంచాయితీల విద్యుత్ బిల్లులను వారే చెల్లించుకోవాలని చెప్పడంతో మూలిగే నక్కపై తాటి కాయ పడిన చందమైంది. పాత బకాయిల చెల్లింపులు సైతం పంచాయితీలపై పెట్టడంతో పలు పాలకవర్గాలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నాయి. దీని వలన నిర్వహణ కష్టతరంగా మారుతుందని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

## కావలిలో కిడ్నాప్ కలకలం

కావలి పట్టణంలో ఒకేరోజు ఇద్దరు యువతులను కిడ్నాప్ చేయడానికి యత్నించిన వైనం కలకలం రేపింది. డిసెంబర్ 9వ తేది కావలిలో కోచింగ్ సెంటర్ నుంచి ఇంటికి వెళ్తున్న యువతి ఆటో ఎక్కగా దారి మళ్లించి వేరే మార్గం గుండా తీసుకొని పోతుండగా అనుమానించిన ఆ యువతి కేకలు వేసినా ఆపకపోవడంతో ఆటో నుంచి దూకి వేసింది. దీంతో ఆమెకు తీవ్ర గాయాలయ్యాయి. అలాగే మరో మహిళ ఆటో ఎక్కగా ఆ ఆటోలోని వ్యక్తులు దారిమళ్లించడంతో ఆ మహిళ ఆటోలో నుంచి దూకేసింది. ఇరువురిని ఆస్పత్రుల్లో చేర్చించి చికిత్స చేస్తున్నారు. ఈ వ్యవహారంతో కావలిలో భయాందోళనలు వ్యక్తం అవుతున్నాయి.

## రెడ్‌క్రాస్ రక్తానికి గ్యారంటీ లేదా?



రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్ వద్ద ఆందోళన చేస్తున్న మహిళలు.

నెల్లూరు రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌లో ప్రాణాలు కాపాడుకోను రక్తంకొని ఎక్కించుకొన్న గర్భిణి హసీనాకు హెచ్ఐవి సోకడంతో ఈ వ్యవహారమై పెద్ద గందరగోళం రేగింది. వెంకటేశ్వరపురానికి చెందిన బీద కుటుంబీకురాలైన ఈ యువతి జీవితం మొత్తం మీద దుర్భరమయ్యింది. ఆమెకు జరిగిన అన్యాయాన్ని ఆమె బంధువులు, ప్రజాసంఘాల నాయకులు ప్రశ్నిస్తే రెడ్‌క్రాస్ పెద్దలు హెచ్ఐవి వైరస్ రావడానికి రక్తం ఒక్కటే కారణం కాదు. ఈమె కాన్పు చేసుకొన్న సమయంలో ఆపరేషన్‌కు ఉపయోగించిన పరికరాల ద్వారానైనా, ఇతర కారణాల వలన వచ్చి ఉండవచ్చేమో అంటున్నారు. రక్తంలో విండో పిరియడ్‌లో వైరస్ ఉంటే తాము చేయగలిగింది ఏమీలేదంటూ తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నారు. హసీనా బృందావనంలోని త్రివేణి హాస్పిటల్‌లో కాన్పు చేయించుకుంది. నవంబర్ 2, 3 తేదీల్లో ఆమెకు రెడ్‌క్రాస్ బ్లడ్‌బ్యాంకు నుంచి తెచ్చిన మూడు యూనిట్ల రక్తం ఎక్కించారు. ఆ తర్వాత హసీనాకు జ్వరమొస్తుండడంతో నారాయణ హాస్పిటల్‌లో చూపించుకోగా పరీక్షల్లో హెచ్ఐవి ఉన్నట్లు తేలింది. నెల్లూరు రెడ్‌క్రాస్‌లో నాణ్యమైన రక్తం సరఫరా చేయడం లేదనే దానికి ఎన్నో సాదృశ్యాలను ఉదాహరణగా చెప్పొచ్చు. ఇక్కడ వేలాది మంది రక్తం ఇవ్వడం, తీసుకోవడం జరుగుతుంటుంది. కానీ ఈ రక్తాన్ని వివరంగా పరీక్షించను ఇక్కడ బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ కోర్సు చేసిన డాక్టర్ లేదు. రెడ్‌క్రాస్ బ్లడ్‌బ్యాంక్ ఆర్థిక పరిపుష్టి బాగుంది. ఆధునిక వైద్య పరికరాలు కొని రక్తాన్ని పరీక్షించాల్సి ఉన్నా ఆ పని చేయడం లేదు. ఎలీసా పద్ధతిలోనే రక్తాన్ని పరీక్షించి ఇచ్చేస్తున్నారు. ఇది ప్రమాదకరం. రక్తంలోని ప్లాస్మాను విదేశాలకు లక్షలాది రూపాయిలకు అమ్ముకొంటున్న విషయం ఈ రచ్చ జరిగాకకానీ బయట పడలేదు. జిల్లా కలెక్టర్ ఈ విషయమై తీవ్రంగానే స్పందించారు. డిఎంఅండ్‌హెచ్ఓ డాక్టర్ మాశిలామణి నేతృత్వంలో విచారణకు ఆదేశించారు. ఈ వ్యవహారంలో అన్యాయం జరిగింది హసీనాకు. దర్యాప్తులు, నివేదికలు ప్రక్కనపెట్టి ఆమెను తక్షణం, జీవితాంతం ఆదుకొనేందుకు ప్రభుత్వం ఓ కార్యాచరణను ప్రకటించాల్సి ఉంది.

## బస్సుల స్పీడు పెరిగింది

ఆర్టీసి బస్సుల స్పీడు పెంచుతూ అధికారులు నిర్ణయం తీసుకొన్నారు. నిన్నమొన్నటి వరకు బస్సుల వేగాన్ని 50 కిలోమీటర్ల వరకే నియంత్రించి ఉండేవాళ్లు. దీని వలన ఎక్స్‌ప్రెస్‌లు, దూర ప్రాంత సర్వీసు బస్సుల రాకపోకలు ఆలస్యం అయ్యేవి. ఈ సమస్యను అధిగమించేందుకు అధికారులు బస్సుల వేగాన్ని 50 నుంచి 70 కిలోమీటర్లు పెంచుతూ నిర్ణయం తీసుకొన్నారు.

## పినాకినిలో చోరీకి యత్నం

నెల్లూరు వస్తున్న పినాకిని ఎక్స్‌ప్రెస్‌లో మహిళలు చోరీకి యత్నించడం కలకలం రేపింది. ఉలవపాడుకు చెందిన లక్ష్మమ్మ అనే మహిళ కావలికి వస్తుండగా కొంత దూరంరాగానే కొందరు మహిళలు ఆమె ఒంటిపై నగలను తస్కరించబోగా కేకలు వేయడంతో ఇతర ప్రయాణీకులు వారిని పట్టుకొని రైల్వే

కొరవ 14వ పేజీలో

# ఘనంగా రొట్టెల పండుగ

## • ఆరు లక్షల మందికి పైగా భక్తులు హాజరు



హిందూ, ముస్లింల మధ్య మత సమైక్యతకు ప్రతీకగా నిలిచే రొట్టెల పండుగ నెల్లూరు బారా షహీద్ దర్గా దగ్గర 5వ తేది నుంచి 10వ తేది వరకు ఘనంగా జరిగింది. ఆరు రోజులపాటు జరిగిన ఈ పండుగకు కర్నాటక, తమిళనాడు, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలతో పాటు మన రాష్ట్రంలోని అన్ని జిల్లాల నుంచి లక్షలాది మంది భక్తులు హాజరయ్యారు. ఆరు లక్షలకు పైబడి భక్తులు ఈ పండుగకు హాజరైనట్లు అధికారులు ప్రకటించినా అంతకంటే ఎక్కువ మంది భక్తులు ఈ పండుగకు వచ్చారని వచ్చిన జనసందోహాన్ని బట్టి తెలుస్తుంది. ఈసారి రొట్టెల పండుగలో భక్తులకు కొంతమేర కష్టాలు తప్పాయి. దర్గా పరిసర ప్రాంతంతోపాటు చెరువుడౌన్ వరకు సిమెంటు రోడ్లు వేయడంతో రొట్టెలు వదలను వచ్చిన భక్తులు వేగంగా కదిలే అవకాశం కల్గింది. కార్పొరేషన్ 40 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి ఏర్పాటుచేసిన సౌకర్యాల వల్ల అపరిశుభ్రత తగ్గింది. శానిటరీ సిబ్బంది కష్టపడి పనిచేశారని చెప్పక తప్పదు. విద్యుత్‌శాఖ చేసిన లైటింగ్ వల్ల దర్గా పరిసర ప్రాంతాలు పండుగ జరిగినన్ని రోజులు రాత్రి పూట కూడా పట్టపగలులా కనపడింది. అంగళ్ల ఒక పద్ధతి ప్రకారం ఏర్పాటు చేయడం వల్ల తొక్కిసలాట తగ్గింది. భారీగా పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయడం వల్ల చిన్నపాటి అపశృతి కూడా దొర్లకుండా చూడగలిగారు. భక్తులు సేదతీరను షెడ్లు లేకపోవడం వల్ల మంచులోనే మూడు నిద్రలు చేయాల్సి వచ్చింది. అదేవిధంగా మహిళలు స్నానాలు చేయను, మరుగుదొడ్ల సౌకర్యంలేక ఇబ్బందులు పడ్డారు. ఎప్పటిమాదిరే రకరకాల రొట్టెల కోసం జనం ఎగబడ్డారు. ఉద్యోగం రొట్టెకు ఎప్పటిమాదిరే డిమాండ్ ఏర్పడింది. ఎమ్మెల్యే వివేకానందరెడ్డి రకరకాల వేషాల ముందు ఈ ప్రాంగణంలోనే ఏర్పాటుచేసిన స్వర్ణకన్యల నృత్యం వెలవెల బోయిందనడం నిజం.

# • పంచాయితీరాజ్ వ్యవస్థలో మార్పులు!

## ✦ ఎమ్పీటీసి, జడ్పీటీసి వ్యవస్థ రద్దు?

పంచాయితీరాజ్ వ్యవస్థలో మూడంచెల విధానం అమలు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం యోచిస్తుంది. ఈ మేరకు ముఖ్యమంత్రి కేంద్ర ప్రభుత్వానికి లేఖ కూడా వ్రాసినట్లు చెబుతున్నారు. మూడంచెల పంచాయితీరాజ్ వ్యవస్థ అమలైతే ఎమ్పీటిసి, జడ్పీటిసి సభ్యులు ఎన్నికలకు దూరమై పోతారు. సర్పంచులు, మండలాధ్యక్షులు, జడ్పీ ఛైర్మన్లకు ప్రాధాన్యం పెరుగుతుంది. రాష్ట్రంలో పంచాయితీరాజ్ వ్యవస్థలో 1959 నుంచి మూడంచెల విధానం అమలులో ఉంది. 1994లో దీన్ని మార్చడం మూలంగా పలువురు చోటాలు, మోటాలు నాయకులై పోయారు. మూడంచెల విధానంలో సర్పంచ్, మండలాధ్యక్షుడు, జడ్పీ ఛైర్మన్ పదవులకు ప్రత్యక్ష ఎన్నికలు జరుగుతాయి. దీనివల్ల గ్రామాల్లో, మండలాల్లో బలమైన నాయకులు వస్తారు. 2006 సంవత్సరంలో జరిగిన స్థానిక సంస్థల ఎన్నికల్లో సైతం ఐదంచెల విధానాన్నే ప్రభుత్వం అవలంభించింది. 2012 మార్చి తర్వాత ప్రభుత్వం జరపాలని భావిస్తున్న స్థానిక ఎన్నికలను మూడంచెల విధానంలో జరిపితే బాగుంటుందని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి లేఖ వ్రాయడం చర్చనీయాంశమయ్యింది. ప్రస్తుతం జిల్లాలో 965 పంచాయితీలు, 545 ఎమ్పీటీసిలు, 46 జడ్పీటీసి స్థానాలున్నాయి. ఈ ఏడాది జులై 21వ తేదితో సర్పంచులు, ఎమ్పీటీసిలు, జడ్పీటీసిల పదవీకాలం ముగిసింది. వీరంతా ఎన్నికల కోసం చకోర పక్షుల్లా ఎదురుచూస్తున్నారు. ఈ నేపథ్యంలో పంచాయితీరాజ్ వ్యవస్థలో ఐదంచెల విధానానికి స్వస్తి చెప్పాలని ఆలోచిస్తుండడంతో వీరిలో ఆందోళన రేకెత్తిస్తుంది.




జిల్లా పరిషత్‌కు మరింత బలం చేకూరేనా?

# మహా మాయగాడు దొరికాడు!

## • 30 కోట్ల రూపాయలు కాజేస్తే మూడు కోట్ల రూపాయలు రికవరీ.

ఊరికో వేషం, ప్రాంతానికో పేరు, దాబూ, దర్పం, మాటలే పెట్టుబడిగా వంచించే మహా మాయగాడు పోలీసులకు దొరికాడు. రామకృష్ణారెడ్డి పేరుతో నగరంలో ప్రముఖులకు వల విసిరి కోట్లాది రూపాయలతో ఉడాయించిన మోసగాడు. పోలీసులను ముప్పతిప్పలు పెట్టి చివరకు ఆదిలాబాద్ జిల్లా బైంసాలో దొరికిపోయాడు. తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఇతని పేరు నాగేశ్వరరావు.



రామకృష్ణారెడ్డి నుంచి స్వాధీనం చేసుకున్న కోట్లాది రూపాయలు డబ్బు. (ఇన్‌సెట్లో రామకృష్ణారెడ్డి).

నాలుగో తరగతికే చదువుకు స్వస్తి చెప్పి వంచన మార్గం పట్టాడు. బియ్యం వ్యాపారిగా, రొయ్యల వ్యాపారిగా, కాంట్రాక్టర్‌గా, రియల్ ఎస్టేట్ వ్యాపారిగా పలు అవతారాలు ఎత్తి, వేరు వేరు పేర్లు పెట్టుకొంటూ రాష్ట్రంతోపాటు తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలలోనూ మోసాలకు పాల్పడిన ఘన చరిత్ర ఈ ప్రబుద్ధుడిది. నెల్లూరులో రియల్ ఎస్టేట్ వ్యాపారం బాగుంటుందని పలువురు ప్రముఖులు సైడ్ బిజినెస్‌గా రియల్ వ్యాపారమంటే ఇష్టపడతారని గ్రహించి ఇక్కడకు వచ్చి రామకృష్ణారెడ్డిగా పేరు చెప్పుకొని ఎందరినో నమ్మించాడు. ప్రముఖ కంటి వైద్య నిపుణుడు డాక్టర్ సాయిమురళితోపాటు పలువురు ప్రముఖులు ఇతని మాయ మాటలకు చిక్కి కోట్లాది రూపాయలు ముట్టజెప్పారు. అంతా పోగేసుకొని రాత్రికి రాత్రి ఉడాయించడంతో ఈ మోసగాడి వ్యవహారం వెలుగు చూసింది. నగర డిఎస్పీ కిషోర్ నేతృత్వంలో కోవూరు సిఐ రాంబాబు బృందం నాగ్‌పూర్ తదితర ప్రాంతాలు గాలించి చివరకు బైంసాలో ఇతన్ని అరెస్ట్ చేశారు. విచారణలో నిర్ఘాంతపోయే విషయాలు వెలుగు చూశాయి. ఏ ప్రాంతానికి వెళ్తే అక్కడ బలమైన సామాజిక వర్గంగా చెప్పుకొని ఆ పేరు పెట్టుకోవడం, తన వద్దకు వచ్చేవారు దర్పంచూసి ఈర్ష్య పడేలా డబ్బు కట్టలు కట్టలుగా గదిలో ఎక్కడంటే అక్కడ పెట్టడం, భారీగా బహుమతులు ఇవ్వడం ఇతని నేర్పరితనం. ఎక్కడా ఫోటో కూడా దొరక్కుండా జాగ్రత్త పడేవాడట. ఏదైనా కార్యక్రమాలకు హాజరైతే వాటిని కవర్ చేసే వీడియో గ్రాఫర్, ఫోటో గ్రాఫర్‌ల అడ్రస్ సంపాదించి వారి వద్దకు వెళ్లి భారీగా నగదు ఆశచూపి తన ఫోటో ఎక్కడా లేకుండా జాగ్రత్త పడేవాడట. అంతే కాకుండా ఎక్కడకు వెళ్తే అక్కడ మహిళలను లొంగదీసుకొని పెళ్లి చేసుకోవడం ఈ ప్రబుద్ధునికున్న మరో అలవాటు. అలాంటి మోసగాడిని పట్టుకోవడంతో పలు అంశాలు వెలుగుచూస్తున్నాయి.

# బోగస్... బోగస్!

## అనర్హుల చేతిలో రేషన్ కార్డులు, పెన్షన్లు, ఇందిరమ్మ ఇళ్లు.

ప్రభుత్వం పేదలకందించే వివిధ పథకాలు కొందరు నేతల పుణ్యమా అని ప్రక్కదారి పడుతున్నాయి. తమ జేబులు నింపుకొనేందుకు అర్హులకు కాకుండా బినామీలకు కేటాయించి తమ గుప్పెట్లో పెట్టుకోవడం, సొమ్ములు జేబులో వేసుకొంటుండడంతో అన్ని పథకాలూ బోగస్‌గా తేలిపోతున్నాయి. సబ్బు బిళ్ల, కుక్కపిల్ల, అగ్గిపుల్ల కాదేదీ కవితకు అనర్హం అన్నట్లు మురికి కాలువల్లో మురుగు దగ్గర్నుంచి దేనినీ వదలకుండా తాము చేజిక్కించుకొని పనుల పేరుతో నిధులు స్వాహా చేయడం మొదలు ఇళ్ల కేటాయింపు, పింఛన్ల మంజూరు, రేషన్‌కార్డులు, గ్యాస్ పథకాలు, స్థలాల కేటాయింపు వరకు అన్నింటిలో బోగస్ పేర్లు వ్రాసి దిగమింగేస్తున్నారు. ప్రభుత్వం పేదలకు నెల నెల మంజూరు చేసే పెన్షన్లను కొందరు కార్పొరేటర్లు ఒక పథకం ప్రకారం స్వాహా చేస్తున్న సంగతి ఇటీవల వెల్లడైంది. అర్హులకు కాకుండా తమవారి పేరున పెన్షన్లు వ్రాయించి నెల నెల ఆ సొమ్మును తమ జేబుల్లో వేసుకొంటున్నారు. రేషన్ కార్డులదీ ఇదేతీరు. ఎడాపెడా రేషన్ కార్డులను అందజేయడంలో చోటా నేతలు తమ పలుకుబడితో అధిక సంఖ్యలో కార్డులు పొంది వాటి ద్వారా లబ్దిపొందుతున్నారు. ఇక ఇందిరమ్మ ఇళ్ల మంజూరులో అన్నీ అవకతవకలే. విజిలెన్స్ శాఖ జరిపిన విచారణలో ఈ నిర్వాకం బట్టబయలైన సంగతి తెలిసిందే. పెన్షన్లు 23వేలు ఉండగా వీటిలో నాలుగు వేలకుపైగా బోగస్ పెన్షన్లు ఉన్నట్లు సమాచారం. పొదుపు సంఘాలకు అందించే గ్యాస్ పంపిణీలోనూ గతంలో చేతివాటం ప్రదర్శించిన విషయం గగ్గోలు రేగడం తెలిసిన సంగతే. ఇలా ఏ ప్రభుత్వ పథకాన్నీ వదలకుండా, పేదల కడుపు కొట్టి వారికి అందకుండా చేసి అక్రమమార్గంలో డబ్బులు గడిస్తున్న ఇలాంటి నేతల వల్ల ప్రభుత్వ లక్ష్యం నెరవేరకుండా పోవడంతోపాటు పేదలకు అన్యాయం జరుగుతుంది. ఎన్ని విచారణలు జరిపినా, నివేదికలు సమర్పించినా అర్హులైన పేదలకు మాత్రం పథకాలు అందడం లేదన్నది వాస్తవం.

# నిద్రమత్తులో పౌరసరఫరాల శాఖ!

**ప్రజా పంపిణీ వ్యవస్థను పౌరసరఫరాల శాఖాధికారులు, సిబ్బంది పట్టించుకోక పోవడం వల్ల డీలర్లు ఎవరికి తోచిన విధంగా వారు నిత్యావసర సరకులను బ్లాక్ మార్కెట్‌లో విక్రయించి సొమ్ము చేసుకొంటున్నారు.**



ఉదాసీనవైఖరి బాటనే పౌరసరఫరాల శాఖ.

ప్రజా పంపిణీ వ్యవస్థ గాడి తప్పింది. పేద ప్రజలకు అవసరమైన నిత్యావసర సరుకులను ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా అందిస్తుంది ప్రభుత్వం. దానిని నిత్యం పర్యవేక్షించాల్సిన పౌరసరఫరాలశాఖ అధికారులు, సిబ్బంది పట్టించుకోకపోవడం వలన ప్రజా పంపిణీ సక్రమంగా జరగడం లేదు. అధికారులు అవలంభిస్తున్న నిర్లక్ష్య వైఖరి మూలంగా ఎవరికి తోచిన విధంగా వారు నిత్యావసర సరుకులను బ్లాక్ మార్కెట్లో విక్రయించి సొమ్ము చేసుకుంటున్నారు. దీంతో ప్రభుత్వ లక్ష్యం నెరవేరకుండా పోయే ప్రమాదం ఏర్పడింది.

రాష్ట్ర ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా అమలు చేస్తున్న రూపాయికి కిలో బియ్యం పథకం రేషన్ షాపు డీలర్లకు వరంగా మారిపోయింది. ప్రారంభ దశనుంచే ఈ పథకం ప్రక్కదారి మళ్లింది. పేదలకు దక్కాల్సిన బియ్యం లారీల్లో రైసు మిల్లులకు వెళ్లిపోతున్నాయి. గతంలో వున్న రెండు రూపాయలకే కిలో బియ్యం, పనికి ఆహారం పథకంలో బియ్యాన్ని స్వాహాచేసిన మాదిరిగానే ప్రస్తుతం అందిస్తున్న రూపాయికి కిలో బియ్యం పథకంలో కూడా అధికారులు చేతివాటం ప్రదర్శిస్తున్నారు. గత నెల ఒకటవ తేది నుంచి ఈ పథకం రాష్ట్రవ్యాప్తంగా అమలు చేస్తున్నారు.

పేదలకు సబ్సిడీ బియ్యం దక్కకుండా దళారీలు, రేషన్ షాపు డీలర్లు రాజకీయ పార్టీల నేతల సహకారంతో బ్లాక్ మార్కెట్‌కు తరలిస్తున్నారు. జిల్లాలో ప్రతి రోజు ఏదో ఒక ప్రాంతంలో సబ్సిడీ బియ్యం పట్టుబడుతూనే వున్నాయి. వాహనాలు, ఆటోల్లో తరలిస్తున్న బియ్యాన్ని పట్టుకునే అధికారులు దీని వెనుక వున్న వ్యక్తుల గురించి సమగ్రంగా విచారణ చేయడం లేదన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. సబ్సిడీ బియ్యం ఏ ప్రాంతం నుంచి తరలించారు? రేషన్ షాపు డీలరు ఎవరు? అన్న సమాచారాన్ని రాబట్టడం లేదు. కేవలం బియ్యం స్వాధీనం చేసుకుని చేతులు దులుపుకొంటున్నారే తప్ప తెర వెనుక వున్న వ్యక్తుల గురించి పట్టించుకోకుండా వదిలేస్తున్నారు. దీంతో ఇతర ప్రాంతాల నుంచి బియ్యం అక్రమంగా తరలించేందుకు మరింత అవకాశం కలుగుతోంది.

రేషన్ షాపులకు సరఫరా చేస్తున్న బియ్యంపై పౌరసరఫరాల శాఖ అధికారులతో పాటు, రెవిన్యూ అధికారులు కూడా తనిఖీలు, పర్యవేక్షణ చేయాల్సిన బాధ్యత వుంది. అయితే డీలర్లతో కుమ్మక్కై షాపుల వైపు కన్నెత్తి కూడా చూడని పరిస్థితి వుంది. సబ్సిడీ బియ్యాన్ని రైసు మిల్లులకు తరలించి అక్కడ రీసైక్లింగ్ చేసి ఇదే బియ్యాన్ని రూ.15ల వంతున మార్కెట్లో విక్రయిస్తున్నారు. ఈ విషయం అన్ని శాఖల అధికారులకు తెలిసినా కూడా ఏం చేయలేకపోతున్నారు. జిల్లాలో ఈ నెలలోనే దాదాపు 10 టన్నుల పైగా సబ్సిడీ బియ్యం పట్టుకున్నారు. ఇందుకు బాధ్యులైన డీలర్లు, రెవిన్యూ అధికారులపై ఎటువంటి చర్యలు తీసుకోకపోవడం విమర్శలకు తావిస్తోంది. సబ్సిడీ బియ్యంతోపాటు పామాయిల్, కందిపప్పు, మినపప్పు, కిరోసిన్, చక్కెర, గోధుమలు, చింతపండు తదితర నిత్యావసర సరుకులు రేషన్ షాపుల ద్వారా అందిస్తున్నారు. ఈ సరుకులన్నీ సకాలంలో పంపిణీ చేయలేక పోతున్నారు. నెల రోజులపాటు సరఫరా చేయాల్సిన సరకులను వారం రోజుల పాటు అందించి ఆ తర్వాత సరుకులు లేవని డీలర్లు చెబుతున్నారు. లబ్ధిదారులకు అందించాల్సిన సరుకులను బ్లాక్ మార్కెట్‌కు తరలించేస్తుంటారు. అధికారులే ప్రజా పంపిణీ వ్యవస్థకు తూట్లు పొడుస్తుండడంతో ప్రజలు కూడా ఫిర్యాదులు చేయలేక పోతున్నారు. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి ఈ వ్యవస్థను గాడిలో పెట్టాల్సిన అవసరం వుంది.





నెల్లూరులోని రెడ్‌క్రాస్ క్యాన్సర్ ఆస్పత్రికి చల్లపల్లి జమీందార్ దివంగత ఎస్ఆర్‌వై.హరిశ్చంద్ర ప్రసాద్ కుటుంబం తరపున ఇరవై ఐదు లక్షల రూపాయల విరాళాన్ని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డికి అందిస్తున్న శ్రీమతి సుచరిత ప్రసాద్.



నూతనంగా బాధ్యతలు స్వీకరించిన బిజెఎంఎం కార్యవర్గ సభ్యులతో జిల్లా బిజెపి అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి, బిజెఎంఎం జిల్లా అధ్యక్షుడు ఆత్మకూరు అంకయ్య.

## 1300 హెక్టార్లలో పంట నష్టం

### వ్యవసాయశాఖ జెడి వెల్లడి.

ఇటీవల జిల్లావ్యాప్తంగా కురిసిన వర్షాలకు 1300 హెక్టార్లలో నారుమళ్లు ధ్వంసమైనట్లు వ్యవసాయశాఖ జెడి నరసప్ప తెలిపారు. మనుబోలు మండలంలోని మడమనూరు గ్రామంలో పొలంబడి కార్యక్రమాన్ని పర్యవేక్షించేందుకు వచ్చిన ఆయన మాట్లాడుతూ జరిగిన నష్టంపై ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపామన్నారు. రైతులు రాయితీ కోసం ప్రతిపాదనలు పంపామని పరిహారం వస్తుందో లేదో మాత్రం తనకు తెలియదని అది ప్రభుత్వ నిర్ణయంపై ఆధారపడి వుంటుందన్నారు. రైతులకు 3.25కోట్ల రూపాయల సబ్సిడీతో వ్యవసాయ పనిముట్లు అందిస్తున్నట్లు తెలిపారు. శ్రీ వరి సాగును జిల్లాలో 16,478 ఎకరాలలో చేపట్టాలని లక్ష్యంగా పెట్టుకున్నామని ప్రస్తుతం 4100 హెక్టార్లలో దీనిని సాగు చేస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో వ్యవసాయ శాఖ అధి కారులు ఉషారాణి, శ్రీదేవి, వెంకటకృష్ణయ్య తదితరులు పాల్గొన్నారు.

## కావలిలో అక్రమ కొళాయి కనెక్షన్లు!

### పట్టించుకోని అధికారగణం

కావలి నియోజకవర్గంలోని పలు మండలాల్లో అక్రమ కొళాయి కనెక్షన్లు అధికమవుతున్నాయి. అధికారుల అనుమతులు లేకుండానే ఇష్టానుసారంగా ఎడాపెడా ఎవరికి తోచిన విధంగా వారు కొళాయి కనెక్షన్లు బిగించుకొంటుండడం గగ్గోలు రేపుతోంది. పైపులు వేసుకొనేందుకు గాను రోడ్డును త్రవ్వేస్తుండడంతో సిమెంటు రోడ్లు అక్రమ కొళాయిల పుణ్యమా అని నామరూపాలు లేకుండా పోతున్నాయి. ముఖ్యంగా కావలి పట్టణంతోపాటు, బోగోలు మండలంలోని వివిధ ప్రాంతాలలో ఈ అక్రమ కొళాయిలు అధికంగా వుంటున్నాయి. మునిసిపాల్టీ పరిధిలో నేతల అండదండలతో కొందరు ఈ అక్రమాలకు పాల్పడుతుండగా మండలాల్లోనూ తామేమీ తీసిపోమనే విధంగా చోటా నేతలు అండ చూసుకొని పలువురు అక్రమ కొళాయి కనెక్షన్లు పొందడమే కాకుండా వాటికి మోటార్లు పెట్టి నీటిని తోడుకొంటుండడంతో పలు ప్రాంతాల ప్రజలకు నీరు అందని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అక్రమ కనెక్షన్ల పుణ్యమా అని తమ ప్రాంతాలకు ఎక్కువ సేపు నీరు అందడం లేదని అధికారికంగా కొళాయి కనెక్షన్లు పొందినవారు వాపోతున్నారు. మొత్తం మీద అక్రమ కొళాయి కనెక్షన్లు అధికమవుతున్నా అలాంటి వారిపై చర్య తీసుకొనేందుకు అధికారులకు నేతలు అడ్డంకిగా మారుతున్నారు.

# కలువాయి రైతుల కన్నెర్ర!

- తోపుగుంటలో రెవిన్యూ సదస్సును అడ్డుకొన్నారు.

వర్షాలకు పంటలు దెబ్బతిని అన్ని విధాల నష్టపోయిన తమ గురించి పట్టించుకోని అధికారులు రైతు సదస్సులు నిర్వహించడం పట్ల కలువాయి మండల రైతాంగం భగ్గుమంది. మండల పరిధిలోని తోపుగుంట గ్రామంలో జరుప తలపెట్టిన రైతు సదస్సును అడ్డుకొనేంత వరకు వెళ్లింది. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి. ఇటీవల కురిసిన వర్షాలకు పలు ప్రాంతాలలో పంట నష్టం జరిగింది. పంట నష్టాన్ని పరిశీలించమంటే విఆర్ఓ కమీషన్లు అడుగుతున్నారంటూ రైతులు వాపోతున్నారు. పలుమార్లు విన్నవించుకొన్న ఫలితం లేకపోవడంతో రైతులు ఆగ్రహం కట్టలు తెంచుకొంది. సదస్సు నిర్వహించేందుకు వచ్చిన అధికారులతో వాగ్వివాదానికి దిగారు. అసలే పంట నష్టపోయిన తాము లంచాలు ఇచ్చేందుకు సొమ్ము ఎక్కడ నుంచి తెచ్చివ్వాలని నిలదీశారు. సదస్సు నిర్వహించాల్సిన గదికి తాళం వేసిన రైతులు ముందు దెబ్బతిన్న పంటలను పరిశీలించిన తర్వాత సదస్సు నిర్వహించాలని ఆందోళనకు దిగారు. తహశీల్దార్ శ్రీనివాసులు జోక్యం చేసుకొని



తోపుగుంటలో రెవిన్యూ సదస్సును అడ్డుకొన్న రైతులు.

రెవెన్యూ సిబ్బందిని పంటల పరిశీలనకు పంపించారు. విఆర్ఓపై చేసిన ఆరోపణలపై లిఖిత పూర్వకంగా ఫిర్యాదు చేస్తే చర్యలు తీసుకొంటామని రైతులకు హామీ ఇవ్వడంతో గొడవ సర్దుమణిగింది. రైతులు హఠాత్తుగా తమ ప్రతాపం చూపడంతో రెవెన్యూ అధికారులు ఖంగుతిన్నారు.

- అధికారుల నిర్లక్ష్యం

# విద్యార్థులకు ప్రాణ సంకటం!

విన్నమాల 'నాక్' సంస్థలో కలుషిత ఆహారం పెట్టారు.

అధికారుల నిర్లక్ష్యం ఫలితంగా విద్యార్థులు కలుషిత ఆహారం తిని ప్రాణాల మీదకు తెచ్చుకొంటున్న ఘటనలు ఇటీవల కాలంలో అధికంగా వుంటున్నాయనేందుకు నాయుడుపేట మండలం విన్నమాల ఘటనే ఉదాహరణ. జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ఆధ్వర్యంలో నేషనల్ అకాడమి ఆఫ్ కన్‌స్ట్రక్షన్ విభాగం (నాక్)లో శిక్షణ పొందుతున్న విద్యార్థులు తిన్న ఆహారం వికటించి అస్వస్థతకు గురయ్యారు. ఇక్కడ ఎలక్ట్రీషియన్, రాడ్ బెండింగ్, తాపీ పని తదితర వృత్తులలో శిక్షణ ఇస్తుంటారు. వీరికి సంఘబంధం మహిళల ద్వారా భోజన సదుపాయాన్ని కల్పించారు. పులిసిన పులిహోర పెట్టడంతో అది తిన్నవారు వాంతులు, విరోచనాలకు గురికావడంతో షుమారు 13 మందిని హుటాహుటిన ఆస్పత్రికి తరలించి చికిత్స అందించారు. విషయం తెలుసుకొన్న ఎంపిడిఓ ప్రమీలారాణి తదితరులు వచ్చి బాధితులను పరామర్శించి అందుకు గల కారణాలను ఆరా తీశారు. నాణ్యత లేకపోవడం, రాత్రి మిగిలిన ఆహారాన్ని ప్రక్కరోజు వడ్డిస్తుండడమే కారణమని తేలింది. గతంలో ఓజిలి మండలంలోనూ మధ్యాహ్న భోజనం తినిన 33 మంది విద్యార్థులు ఆస్పత్రిపాలైన విషయం మరువక ముందే ఇలాంటివి చోటు చేసుకొంటుండడం పట్ల విద్యార్థుల తల్లిదండ్రులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. అధికారుల పర్యవేక్షణ కొరవడడం వలన నాణ్యత లేని ఆహారాన్ని అందిస్తున్నారంటూ ఆగ్రహం వ్యక్తం చేశారు.

# సబ్ స్టేషన్ నిర్మాణమెప్పుడు?

సబ్‌స్టేషన్ ఏర్పాటుకు అధికారులు అనుమతిచ్చినా స్థలం దొరకని పరిస్థితి ఎదురౌతుంది తోటపల్లి గూడూరు మండలంలో. కోడూరు మజరా నెల్లిమిట్ట కండ్రిగలో 33/11కెవి విద్యుత్ సబ్‌స్టేషన్ నిర్మాణానికి నిధులు మంజూరైనాయి. కోటి రూపాయలతో చేపట్టేందుకు టెండరు దక్కించుకొని కాంట్రాక్టర్ నిర్మాణానికి సిద్ధమైనా ఎక్కడ ఏర్పాటు చేయాలన్నదే సమస్య అయ్యింది. దీనికి తగిన స్థలం దొరక్కపోవడంతో నిర్మాణం ఆలస్యమవుతోంది. విద్యుత్‌శాఖ అధికారులు

### నెల్లిమిట్ట కండ్రిగలో వింత పరిస్థితి

ఈ ప్రాంత అధికారపార్టీ నేతలను స్థలం చూపించమని కోరినా స్పందన కరువయ్యింది. ప్రస్తుతం చెన్నపల్లిపాళెంలో గల సబ్‌స్టేషన్‌పై అధిక భారం పడి నెల్లిమిట్ట కండ్రిగ, పట్టపుపాళెం తదితర ప్రాంతాల్లో తరచూ విద్యుత్ అంతరాయం ఏర్పడుతోంది. కొత్త సబ్‌స్టేషన్ ఏర్పాటు జరిగితేనైనా ఈ సమస్య తీరుతుందని ఆశిస్తున్న ప్రజలకు స్థలం సమస్య అడ్డంకిగా మారుతోంది. ప్రజోపయోగ కార్యక్రమాలకు, నిర్మాణాలకు సైతం స్థలం చూపించలేని స్థితిలో అటు మండల అధికారులు, ఇటు పాలకులు వుండడం సిగ్గుచేటు.

# సద్వినియోగం చేసుకోండి!

- రెవిన్యూ సదస్సులపై కలెక్టర్ సలహా!



రెవెన్యూ సదస్సులను ప్రజలు సద్వినియోగం చేసుకో మని జిల్లా కలెక్టర్ శ్రీధర్ కోరారు. పెళ్లకూరు మండలం కానూరు రాజుపాళెం గ్రామంలో జరిగిన రెవెన్యూ సదస్సుకు విచ్చేసిన కలెక్టర్ మాట్లాడుతూ ప్రజలకు అవసరమైన వివిధ సర్టిఫికేట్లు పొందేందుకు, సమస్యలను పరిష్కరించుకునేందుకు ఈ సదస్సులు ఎంతగానో ఉపయోగపడతాయన్నారు. రెవెన్యూ కార్యాలయాల చుట్టూ తిరిగినా ఫలితం లేకుండా పోయిందని అనుకున్న వారికి ఈ కార్యక్రమం ఫలితాలనిస్తుందన్నారు. ఈ సందర్భంగా ప్రజలు అధికసంఖ్యలో విచ్చేసి పలు సమస్యలను కలెక్టర్ దృష్టికి తీసుకొని వచ్చారు. కొందరు రెవెన్యూ సిబ్బంది భూస్వాములు, రాజకీయ నేతలతో కుమ్మక్కై అర్హులకు కాకుండా బినామి పేర్లతో ఎవరెవరికో ఇళ్ల పట్టాలు ఇస్తున్నారంటూ కలెక్టర్‌కు ఫిర్యాదు చేశారు. నకిలీ పాసుపుస్తకాలు అందిస్తున్నారని చెప్పగా కలెక్టర్ స్పందిస్తూ దీనిపై నివేదిక అందజేయాలని అధికారులను ఆదేశించారు. ఈ కార్యక్రమంలో ఎమ్మార్వో ఈశ్వరమ్మతోపాటు వివిధ శాఖల అధికారులు పాల్గొన్నారు.

# మేకపాటిపై నిప్పులు చెరిగిన వంటేరు!



నెల్లూరు పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన్ రెడ్డిపై మాజీ శాసనసభ్యుడు వంటేరు వేణుగోపాలరెడ్డి తీవ్ర విమర్శలు చేశారు. జన్మదినం సందర్భంగా కావలి పట్టణంలో అభిమానులు ఏర్పాటు చేసిన కార్యక్రమానికి విచ్చేసిన వంటేరు మేకపాటిపై విరుచుకపడ్డారు. ఎంపిగా గెలిచి రెండేళ్లు గడుస్తున్నా ఇంతవరకు ఎలాంటి అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టలేదన్నారు. ఏ శాసనసభ నియోజకవర్గంలోనూ చిన్నపాటి పని చేయలేదని జగన్, విజయమ్మల భజన చేస్తూ కాలం గడుపుతున్నారని తూర్పార బట్టారు. నియోజకవర్గ సమస్యలపై స్పష్టత లేని ఆయనకు ప్రజల సమస్యలు పట్టవన్నారు. పనిలో పనిగా కోవూరు మాజీ శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డిని దుయ్యబట్టారు. పార్టీలు మారిన ప్రసన్న 93వ సంవత్సరంలో మాదిరి ఉప ఎన్నికల ఫలితాలు ఉంటాయని భావిస్తూ, ఊహల్లో వుంటున్నాడని ఈసారి ఆయనకు ప్రజలు తగిన బుద్ధి చెప్తారన్నారు. ప్రసన్నకు ఓటమి తప్పదని, తెలుగుదేశంపార్టీ అభ్యర్థి కోవూరు ఉప ఎన్నికలలో విజయం సాధించడం ఖాయమని జోస్యం చెప్పారు. త్వరలో ఉదయగిరిలో నియోజకవర్గానికి ఉప ఎన్నికలు రానున్నట్లు చెప్పిన వేణుగోపాలరెడ్డి తెలుగుదేశం పార్టీ కార్యకర్తలందరూ ఐక్యంగా పని చేసి విజయాలను సొంతం చేసుకోవాలని కోరారు.

### గెలిచి చేసిందేమిటి?

# ఆధార్ కార్డ్‌కు వసూళ్లు!

## గూడూరులో గొడవ... గొడవ

ప్రతి కుటుంబానికి అందజేసేందుకు తీస్తున్న ఆధార్ కార్డులకు డబ్బులు వసూలు చేస్తున్న వ్యవహారం గూడూరు మండలంలో గగ్గోలు రేపుతోంది. ఉచితంగా ఎలాంటి రుసుము లేకుండా ఆధార్‌కార్డులు తీస్తుండగా మండలంలోని రామలింగాపురం గ్రామంలో ఏర్పాటు చేసిన సెంటర్‌లో మాత్రం 54 రూపాయలు ముక్కుపిండి వసూలు చేస్తుండడం విశేషం. మిగతా చోట్ల ఉచితంగా తీస్తున్నారు కదా అని గ్రామస్తులు ప్రశ్నిస్తే నిర్వాహకులు మాత్రం ఫోటో తీసినందుకు 50 రూపాయలు, జెరాక్స్‌కు గాను 4 రూపాయలు అని దబాయించి చెప్పి వసూళ్లకు పాల్పడుతున్నారట. తాము అడిగినంత ఇస్తేనే ఆధార్ కార్డులు తీస్తామని లేదంటే కార్డులు ఇవ్వమంటూ తెగేసి చెప్తుండడంతో గొడవకు దిగుతున్నారు గ్రామస్తులు. వివాదం పెద్దది కావడంతో ఆగ్రహించిన వారు ఆధార్ సెంటర్‌కు ఏకంగా తాళాలు వేశారు. దీనిపై ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని ఆధార్‌కార్డు పేరుతో జరుపుతున్న వసూళ్లను అరికట్టాలని మండల ప్రజలు కోరుకుంటున్నారు.

# నమ్మకంలేని నాయకుడు!

## ప్రసన్నపై సోమిరెడ్డి ధ్వజం



రాజకీయాలలో నైతిక విలువలు కోల్పోయిన నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి కోవూరు ప్రజల నమ్మకాన్ని కోల్పోయాడని తెలుగు దేశంపార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి విమర్శించారు. స్థానిక తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో జరిగిన కార్యకర్తల సమావేశానికి పాల్గొనేందుకు వచ్చిన సోమిరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డిపై నిప్పులు చెరిగారు. పేరుగాంచిన రాజకీయ కుటుంబంలో పుట్టిన ప్రసన్న ఆ కుటుంబానికి అపకీర్తి తెచ్చిపెట్టాడన్నారు. ఎన్నికలు వస్తే బావా అంటూ బంధుత్వం కలిపి దగ్గరకు వస్తాడని, అవసరం తీరగానే సహాయం చేసిన వారినే విమర్శించే తత్వం ప్రసన్నదని దుయ్యబట్టారు. రాజకీయాలలో ఎన్ని తప్పులు చేసినా చంద్రబాబు తనను చూసి ప్రసన్నకుమార్‌రెడ్డిని క్షమించాడని చెప్పుకొచ్చారు. ఎంతసేపు వారికి భక్తి వుందా, వీరికి వుందా, ప్రమాణం చేయి, కాణిపాకం వెళ్దామా, మూలాపేటకు వెళ్దామా అంటూ సవాళ్లు విసిరే ప్రసన్న కుమార్‌రెడ్డికి అసలు దేవుడి మీద భక్తి వుందా అని ప్రశ్నించారు? రాబోయే ఎన్నికల్లో నియోజకవర్గ ప్రజలు ఆయనకు తగిన గుణపాఠం చెప్తారని తెలుగుదేశం పార్టీ ఘన విజయం సాధించడం ఖాయమన్నారు.

# గూడూరు హాస్టళ్లు అధ్వాన్నం!

- పట్టించుకోని అధికార గణం

గూడూరులోని పలు సంక్షేమ హాస్టళ్ల పరిస్థితి అధ్వాన్నంగా వుంది. కనీస సౌకర్యాలకు నోచుకోక, సరైన వసతి లేక హాస్టళ్లలో చదువుకొంటున్న విద్యార్థులు తీవ్ర అవస్థలు పడుతున్నారు. డివిజన్‌లో ఎస్సీ, ఎస్టీ, బిసి హాస్టళ్లు మొత్తం 50 వున్నాయి. వీటిలో దాదాపు ఆరువేల మంది బాల, బాలికలు చదువుకొంటున్నారు. చాలా వరకు హాస్టల్ భవనాలు శిథిలమైపోయి వున్నాయి. శ్లాబ్ పెచ్చులూడి పోతున్నాయి. అధికభాగం హాస్టళ్లలో ముఖ్యంగా బాలిక హాస్టళ్లలో స్నానపు గదులు, మరుగుదొడ్లు లేకపోవడంతో బహిరంగ ప్రదేశాలకు వెళ్లాల్సి రావడంతో వారు తీవ్ర అసౌకర్యానికి గురి కావాల్సి వస్తోంది. సగానికి సగం అద్దె భవనాల్లో నిర్వహిస్తున్నారు. విద్యార్థుల సంఖ్య ఎక్కువ కావడం సరిపడా గదులు లేకపోవడంతో సమీపంలో గల పాఠశాలల్లో తలదాచుకోవాల్సిన పరిస్థితులు నెలకొంటుండడంతోపాటు మంచినీటి కోసం వీధి కొళాయిలపై ఆధారపడాల్సిన పరిస్థితి ఎదురౌతుంది. శీతాకాలంలో అయితే విద్యార్థులు పడే అవస్థలు అన్నీ ఇన్నీ కావు. చలి నుంచి రక్షణ పొందేందుకు సరైన దుప్పట్లు లేక పిల్లలు వణికిపోవాల్సి వస్తోంది. దీనికితోడు విద్యార్థులకు ఆహారం అందించేందుకు ఒక పూటకు ఐదురూపాయలు అందజేస్తుండడంతో ఆ మొత్తానికి నాణ్యమైన ఆహారాన్ని అందించలేకపోతుండడంతో విద్యార్థులు ఆకలితో పస్తులుండాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. మెస్ చార్జీలను పెంచాలని పలు విద్యార్థిసంఘాలు, పార్టీలు డిమాండ్ చేస్తున్నా ప్రభుత్వం పట్టించుకోక పోవడంతో విద్యార్థులు చాలీచాలని ఆహారంతో సరిపెట్టు కోవాల్సి వస్తోంది.

# పుణ్యాన్ని ప్రసాదించే అనఘాష్టమి వ్రతం!



దేశ సంస్కృతి, సాంప్రదాయాలలో పండుగలకు, వ్రతాలకు ఎంతో ప్రాముఖ్యత వుంది. ఆయా ప్రాంతాల సంస్కృతులు వీటిలో ప్రతిబింబిస్తాయి. ఆనందోత్సాహాలను దైవభక్తిని పెంపొందించే పండుగలతోపాటు, కుటుంబ క్షేమాన్ని కాంక్షిస్తూ చేసే వ్రతాలు ప్రాముఖ్యత కల్గినవే. ఒక్కో మాసంలో చేసే ఒక్కో వ్రతానికి పురాణ నేపథ్యం వుంది. అలాంటి వాటిలో మార్గశిర మాసంలో చేసే అనఘాష్టమి వ్రతం ఒకటి.

త్రిమూర్తుల అంశ అయిన దత్తాత్రేయుడు పలు రూపాలను ధరించాడు. శ్రీపాదవల్లభునిగా, నృసింహ సరస్వతిగా పేరు గాంచిన దత్తాత్రేయుడు గృహస్తురూపం ధరించాడు. అనఘస్వామి పేరుతో ఆ రూపాన్ని ధరించగా, అర్ధాంగికి అనఘాదేవి అనే పేరొచ్చింది. లక్ష్మీదేవి అవతారంగా అనఘాదేవిని చెప్తారు. అనఘస్వామిలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల లక్షణాలు వున్నట్లే అనఘాదేవిలోను శ్రీరాజరాజేశ్వరి, శ్రీమహాలక్ష్మి, మహంకాళి, మహాసరస్వతి లక్షణాలు మెండుగా వున్నట్లు పురాణాలు చెప్తున్నాయి. అనఘుడు విష్ణు స్వరూపమైతే, అనఘాదేవిని లక్ష్మీస్వరూపంగా భావించి పూజిస్తారు. దంపతులిద్దరూ, తపోమయమైన జీవనం గడుపుతూ భక్తులకు ఆత్మజ్ఞానాన్ని అనుగ్రహిస్తుంటారు. వీరికి అష్టసిద్ధులనబడే అణిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం, కామన సహిత, మహిమ అనే ఎనిమిది మంది పుత్రులుగా అవతరించారు. అనఘస్వామిని, అనఘాదేవిని పూజించడం వలన కోరిన కోర్కెలు తీరుతాయని చెప్తారు. యోగీశ్వరి, జగన్మాత అయిన అనఘాదేవి యోగం నందు ప్రీతికలది. గృహాన్ని, పతి, పత్ని, సంతానాన్ని అనుగ్రహిస్తుంది. యోగసిద్ధిని కల్గిస్తుంది. సమస్త కోరికలను సిద్ధింపజేస్తుంది. కవితాశక్తిని, కళలను ప్రసాదిస్తుంది. అలాంటి దంపతుల రూపంలో వుండే స్వామి, అమ్మవారి పేర్లతో వుండే వ్రతాన్ని ఆచరించినట్లయితే సకల శుభాలు కల్గుతాయని పురాణాలు చెప్తున్నాయి. అఘమ అంటే పాపము. ఈ పాపాలు మూడు రకాలుగా చెప్తారు. అవి మనసు, వాక్కు, కర్మల ద్వారా వచ్చే పాపాలు. అనఘ అంటే మూడు రకాల పాపాలను నశింపచేసేది అని అర్థం. అనఘాష్టమి వ్రతం చేయడం వలన పాపాలు తొలగి పుణ్యం కల్గుతుందని ప్రశస్తి. ఈ వ్రతాన్ని మార్గశిర మాసం కృష్ణపక్ష అష్టమినాడు ఆచరిస్తారు. ఆనాడు ఈ వ్రతం చేయడం ఉత్తమంగా చెప్తారు. లేనిపక్షంలో నెలనెలా వచ్చే కృష్ణపక్ష బహుళ అష్టమినాడు చేయవచ్చు. పురాణ ప్రసిద్ధి చెందిన ఈ వ్రతాన్ని చేసేవారు ఇంటిని శుభ్రపరచి తూర్పు ఈశాన్యం దిక్కున పీఠం ఏర్పాటు చేసి దేవతలను ప్రతిష్టించాలి. అనంతరం కుటుంబ సభ్యులు, బంధుమిత్రులతో కలసి వ్రతం చేసి పండ్లు, పంచకర్జాయం నైవేద్యంగా పెట్టాలి. మరుసటి నాడు ఆ దేవతా రూపాలను నదీజలాల్లోగాని, చెరువులో గాని వదలిపెట్టాలి. ఈ వ్రతం చేపట్టడం వలన శ్రీపాదవల్లభుని కృపా కటాక్షాలు లభిస్తాయని చెప్తారు.

J

## ట్రంకురోడ్డు కబుర్లు

### సిద్ధూ బాదుడు



క్రికెట్ ఆటలో సిక్సర్ల సిద్ధూగా అందరికీ సుపరిచితుడైన నవజ్యోత్‌సింగ్ సిద్ధూ ఇప్పుడు పార్లమెంట్ సభ్యుడు కూడా. గతవారం ఈయన వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్ట్‌లో ఏర్పాటైన కార్యక్రమంలో పాల్గొనను చెన్నై నుంచి కారులో వస్తుండగా టోల్‌ప్లాజా సిబ్బంది ఈయన పట్ల కాస్త దౌర్జన్యంగా వ్యవహరించబోయారు. దీంతో మరో మాట మాట్లాడకుండా సిద్ధూ ఇక్కడి సెక్యూరిటీ గార్డును నాలుగు పీకి తన కారులో వేసుకొని వచ్చేశారు. గార్డు తాను చేసిన తప్పు ఒప్పుకొని సిద్ధూకు క్షమాపణలు చెబితేగాని ఆయన శాంతించలేదు. ఐదవ నెంబర్ జాతీయ రహదారిపై వున్న టోల్‌ప్లాజాల్లోని సిబ్బంది చేసే దౌర్జన్యాలు సిద్ధూ చేసిన సాహసం వల్ల లోకానికి వెల్లడయ్యాయి.

### రొట్టె పట్టి ఎమ్మెల్యేనయ్యా!



నెల్లూరులో జరిగిన రొట్టెల పండుగకు అయ్యప్పదీక్షలో వుంటూ హాజరయ్యారు కనిగిరి ఎమ్మెల్యే ఉగ్రనరసింహారెడ్డి. మీడియా వాళ్లు ఏమిటి ఇలా వచ్చారంటే మ్రొక్కుబడి తీర్చనన్నారాయన. తాను ప్రకాశం జిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షునిగా వుంటూ రొట్టెల పండుగకు హాజరయ్యానని ఈ సందర్భంగా ఎమ్మెల్యే కావాలని రొట్టె పట్టడంతో అయిపోయానన్నారు. దీనికి ప్రతిఫలంగా గత రెండేళ్లుగా నెల్లూరుకు వచ్చి ఈ రొట్టెలు వదలివెళ్తున్నానన్నారు. ఉగ్రనరసింహారెడ్డి వదలిన రొట్టెను పట్టి పంచుకోవడంలో ఔత్సాహిక నేతలంతా పోటీ పడ్డారు. రొట్టెలో ఏ ముక్క ఎవర్ని ఎమ్మెల్యే చేస్తుందో మూడేళ్ల తర్వాత గానీ తెలియదు.

### రొట్టెలు పట్టిన కలెక్టర్ - ఎస్పీలు

నగరంలో ఆరు రోజులపాటు ఘనంగా జరిగిన రొట్టెల పండుగకు లక్షలాది మంది భక్తులు విచ్చేసి తమ కోర్కెలు తీర్చే రొట్టెలు పట్టుకెళ్లారు. వివిఐపి... సామాన్యుడు అనే తేడా లేకుండా అందరూ నెల్లూరు చెరువు నీళ్లను నెత్తిపై చల్లుకొని ఆ తర్వాత రొట్టెలు పట్టారు. కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి, ఎస్పీ బివి.రమణ కుమార్‌లు సతీ సమేతంగా రొట్టెల పండుగకు హాజరై సౌభాగ్యం, సంక్షేమం, తమ పిల్లల విద్యకు సంబంధించిన రొట్టెలు పట్టుకోవడంతోపాటు దర్గాలోనికి వెళ్లి బారాషహీద్లకు చదివింపులు చేశారు. గంధమహోత్సవానికి వీరు సైతం హాజరుకావడం వీరికున్న ఆధ్యాత్మిక భావనను బయటపెట్టింది.

### చిందర వందర గందరగోళం!




రొట్టెల పండుగను పురస్కరించుకొని వారం రోజులపాటు నెల్లూరు నగరం జన సముద్ర మయ్యింది. బస్సు, రైల్వే స్టేషన్లు ప్రయాణీకులతో కిటకిటలాడాయి. రోడ్లన్నీ ట్రాఫిక్‌తో నిండి పోయాయి. పోలీసులు ఎంత ప్రయత్నించినా ట్రాఫిక్‌ను క్రమబద్ధీకరించ లేక పోయారు. హోటళ్లు, లాడ్జీలు జనంతో నిండిపోయాయి. అనుకోని అతిథుల వల్ల నగర వాసులకు ఇక్కట్లు ఎదురైనా నెల్లూరు ప్రాముఖ్యత తెలియ జేసే పండుగ కావడంతో ఎవర్నీ పల్లెత్తు మాట అనకుండా సర్దుకపోయారు.

### పంజా దెబ్బ

పవర్‌స్టార్ పవన్ కళ్యాణ్ నటించిన పంజా సినిమా విడుదల సందర్భంగా చిరంజీవి, పవన్ కళ్యాణ్ అభిమానుల మధ్య టిక్కెట్ల పంపకంలో రేగిన వివాదం చిలికి చిలికి గాలివానగా మారింది. ఎవరికి వారు టిక్కెట్లలో వాటా కోసం మెట్టు దిగకపోవడంతో గొడవ పెద్దదయ్యింది. మెగాస్టార్, పవర్‌స్టార్ అభిమానులు సినిమా హాళ్ల వద్దే బాహాబాహీకి దిగి తమ పంజాదెబ్బల బలాన్ని చూపించడం ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

## తెలుగుదేశంలో వారసుల పోరు



తెలుగుదేశం పార్టీలో ఎన్టీరామారావు వారసుల పోరు మొదలైంది. పార్టీ పరంగా ఎన్టీఆర్ వారసుడిగా హరికృష్ణను తెరపైకి తెచ్చిన బాబు ఇప్పుడు పునరాలోచనలో పడ్డాడు. హరికృష్ణ కొంతకాలంగా బాబుపై అసంతృప్తిగా వున్నాడు. పార్టీ భవిష్యత్ పగ్గాలు తన కుమారుడు జూనియర్ ఎన్టీఆర్‌కు అప్పచెప్పాలంటూ హరికృష్ణ అందుకున్న కొత్త నినాదం బాబుకు నచ్చడం లేదు. పార్టీ వారసత్వం గురించి ఇప్పుడే ఇటువంటి ప్రచారం లేవదీయడం మంచిది కాదని బాబు భావిస్తున్నాడు. అయితే హరికృష్ణ మాత్రం ఇందుకు ససేమిరా అంటున్నాడు. జూనియర్ ఎన్టీఆర్‌ను భవిష్యత్ నాయకుడిగా తెరపైకి తేవాల్సిందేనని హరికృష్ణ పట్టుబడుతున్నాడు. దీంతో హరికృష్ణతో అమీతుమీ తేల్చుకోవాలని బాబు ఇప్పటికే ఓ నిర్ణయానికొచ్చాడు. ప్రస్తుతం రాజ్యసభ సభ్యుడిగా మాత్రమే గాక పార్టీ పొలిట్‌బ్యూరోకు కూడా ప్రాతినిధ్యం వహిస్తున్నాడు హరికృష్ణ. త్వరలో జరగబోయే పార్టీ పునర్వ్యవస్థీకరణలో హరికృష్ణను తప్పించి బాలకృష్ణను పొలిట్‌బ్యూరో సభ్యుడిగా నియమించాలని బాబు భావిస్తున్నాడు. ఇందుకనుగుణంగానే బాలకృష్ణ కూడా పార్టీ కార్యాలయం వాస్తు బాగోలేదంటూ దగ్గరుండి మరీ మరమ్మత్తులు చేయిస్తూ, పార్టీలోని నాయకులతో తరచూ మాట్లాడుతూ భవిష్యత్ కార్యక్రమాల గురించి చర్చిస్తున్నాడు.

## విఆర్ఎస్ టు టిఆర్ఎస్



సీనియర్ ఐఎఎస్ అధికారి, ప్రస్తుత రెవెన్యూశాఖ ముఖ్యకార్యదర్శి రమణాచారి విఆర్ఎస్‌కు (స్వచ్ఛంద పదవీ విరమణ) దరఖాస్తు చేశాడు. వాస్తవానికి వచ్చే ఫిబ్రవరిలో ఆయన పదవీ విరమణ చేయాల్సి వుంది. అయితే రెండు నెలలకు ముందుగానే ఆయన పదవీ విరమణ చేయాలని నిర్ణయించాడు. దీనికి చారి చెప్పే కారణాలు రకరకాలుగా వున్నాయి. తన లాంటి సీనియర్ సేవల్ని ప్రభుత్వం సరిగా ఉపయోగించుకోవడం లేదన్నది ఆయన ప్రధాన అసంతృప్తి. అయితే రెవెన్యూ శాఖ ముఖ్యకార్యదర్శి చిన్న పోస్టేమీ కాదు. ఇంతకంటే మించిన పోస్టు ఇంకేముంటుందని ప్రభుత్వ వర్గాలు విస్మయాన్ని వ్యక్తం చేస్తున్నాయి. నిజానికి రమణాచారి రాజకీయాల్లోకి రావాలని యోచిస్తున్నాడని, ఇందులో భాగంగానే విఆర్ఎస్ డ్రామా నడుపుతున్నాడని ఆ వర్గాలంటున్నాయి. సచివాలయంలో రమణాచారి ప్రస్తావన వస్తే విఆర్ఎస్ టు టిఆర్ఎస్ అంటూ ఐఎఎస్‌లు చెవులు కొరుక్కొంటున్నారు. అయితే రమణాచారి మాత్రం ప్రస్తుతం రెండు పడవల మీద కాలుపెడ్తున్నాడు. ఒకటి టిఆర్ఎస్ పార్టీలో చేరడం, రెండు సమాచార హక్కు కమిషనర్‌గా పోస్టును దక్కించుకోవడం.

## జగన్ టీవీలో దిలీప్‌రెడ్డి




అయిదేళ్లపాటు రాష్ట్ర సమాచార కమిషనర్‌గా పనిచేసిన దిలీప్‌రెడ్డి ప్రస్తుతం సాక్షి టీవీలో మేనేజింగ్ ఎడిటర్‌గా చేరాడు. ఈనాడు పత్రిక ఢిల్లీ విలేకరిగా పనిచేస్తున్నప్పుడు వైఎస్ఆర్, కెవిపిలతో ఏర్పడిన స్నేహం ఆయన్ను సమాచార కమిషనర్‌గా చేసింది. అయిదేళ్ల పూర్తయ్యాక ఉద్యోగుల పరిపాలనా ట్రిబ్యునల్ జడ్జి పదవిని ఇప్పించాల్సిందిగా దిలీప్ సిఎం కిరణ్‌రెడ్డిని ఆశ్రయించాడు. ట్రిబ్యునల్ జడ్జి పదవికి దిలీప్‌కు అర్హత లేదు. అయినా కిరణ్ మాత్రం దిలీప్ కోసం తీవ్రంగా ప్రయత్నించాడు. అయితే ఎందుకో గవర్నర్ నరసింహన్ అడ్డుపడ్డాడు. దిలీప్ లాంటి అర్హత లేని వారికి ట్రిబ్యునల్ పదవి ఇవ్వడం కుదరదని ఇందుకు సంబంధించిన ఫైల్‌ను తిప్పి పంపారు. అయినా కిరణ్ మాత్రం ససేమిరా అంటూ దిలీప్ నియామకాన్ని ఆమోదించాల్సిందేనంటూ గట్టిగా సిఫార్సు చేస్తూ తిరిగి గవర్నర్‌కు ఫైలు పంపాడు. అయితే గవర్నర్ మాత్రం ఒత్తిడికి తలొగ్గకుండా కేంద్ర ప్రభుత్వానికి లేఖ వ్రాశాడు. కేంద్రం నుంచి 'నో' అంటూ సమాధానం రావడంతో గవర్నర్ సీరియస్‌గా దిలీప్ ఫైలును తిరగ్గొట్టాడు. దీంతో భంగపడ్డ దిలీప్ మరునాడే సాక్షి టీవీలో చేరిపోయాడు.

## చిరుకు మళ్లీ వెయిటింగే!



ఎంతకాలం... ఇంకెంతకాలం... కేంద్రమంత్రి పదవంటూ ఎదురుచూస్తున్న మెగాస్టార్ చిరంజీవికి మళ్లీ నిరాశే ఎదురవుతోందా? అవుననే అంటున్నాయి గాంధీభవన్ వర్గాలు. త్వరలో జరగనున్న కేంద్ర మంత్రివర్గం మార్పులు–చేర్పుల్లో 'చిరు'కు ఖాయంగా మంత్రిపదవి వస్తుందని ప్రజారాజ్యం పార్టీ వర్గాల్లో ప్రచారం జరుగుతోంది. అయితే 'చిరు' ఆశ మాత్రం ఇప్పట్లో తీరేట్లు లేదు. ప్రస్తుతం రాజ్యసభ స్థానాలు ఎక్కడా ఖాళీ లేకపోవడంతో చిరు కేంద్ర రాజకీయ రంగప్రవేశానికి మరికొంతకాలం వేచి చూడాలని కాంగ్రెస్ అధిష్టానం యోచిస్తోంది. అయితే ఎలాగైనా సరే 'చిరు'కు తక్షణం కేంద్రమంత్రి పదవి ఇవ్వాల్సిందేనంటూ పిఆర్‌పి వర్గాలు పట్టుబడుతున్నాయి. రాష్ట్రంలో మరో రెండు మూడు నెలల్లో ఉప ఎన్నికలు రానున్న దృష్ట్యా 'చిరు' సేవలు ఎంతో అవసరమని ఆ వర్గాలు చెబుతున్నాయి. చిరుకు కేంద్రమంత్రి పదవి ఇవ్వడం వల్ల ఉప ఎన్నికల్లో 'చిరు' ప్రచారానికి ఊపువస్తుందని, దానివల్ల కాంగ్రెస్‌కు ప్రయోజనం కలుగుతుందన్నది వారి వాదన. అయితే 'చిరు' పదవికి పరిస్థితులు కూడా అనుకూలించాలి కదా! అంటూ కాంగ్రెస్ అధిష్టానం ప్రస్తుతానికి దాటేస్తోందట. పాపం చిరు... కేంద్రపదవికి మరికొంత సమయం వేచి వుండక తప్పదేమో!!






వాసిరెడ్డి వసంతకుమార్‌రెడ్డి తనయ వినయ, అనిల్‌రెడ్డిల వివాహం డిసెంబర్ 4తేది హైదరాబాద్‌లోని హోటల్ మ్యారీగోల్డ్‌లో జరిగింది.



నెల్లూరు రూరల్ నియోజకవర్గ పరిధిలోని మూలాపేటలో పాదయాత్ర చేస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నాయకుడు శ్రీధర్‌రెడ్డి.



నాగభైరవ కోటేశ్వరరావు స్మారకా కవితా పురస్కారాన్ని కవి రసరాజుకు అందజేస్తున్న సినీ దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు. ప్రక్కన ఎఎస్పీ నాగేశ్వరరావు, హజరత్‌బాబు, వెన్నెలకంటి, సి.నారాయణరావు తదితరులు.

# వారఫలాలు

*తేది 17-12-2011 నుండి 23-12-2011 వరకు ధనుస్సులో రవి; మకరంలో శుక్రుడు; మేషంలో గురువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో బుధ, రాహువులు; వృషభంలో కేతువు; సింహ, కన్య, తుల, వృశ్చికాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




వివాహాది శుభకార్య ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. శుభకార్యాలలో పాలు పంచుకొంటారు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. శ్రమకు తగ్గ ఫలితం లభించక పోవచ్చు. తొందరపాటు నిర్ణయాలు వద్దు. ఓపిక అవసరం. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు బాగా సాగుతుంది. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగా వుండాలి. నూతన పరిచయాలు సత్ఫలితాలనిస్తాయి.




చిన్న చిన్న విరోధాలు మనశ్శాంతిని చెడగొడతాయి. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. కళత్ర ఆరోగ్యం అంతంత మాత్రమే. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. మాటలు వదలడంలో జాగ్రత్త అవసరం. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. వివిధమార్గాల ధనప్రాప్తి. సోదరుల తోడ్పాటు చక్కగా వుంటుంది. వృథా వాదాలకు దిగవద్దు.




కళత్ర ఆరోగ్యం, సంతానమూలంగా మానసిక వేదనకు గురౌతారు. ప్రయాణాలు కోరినరీతిలో జరుగవు. ముందుచూపుతో అడుగేయాలి. ప్రతి విషయంలో ఎదుటివారు తప్పుగా అంచనా వేస్తారు. ముఖ్యమైన వాటిని వాయిదా వేయడం మంచిది. నరాలకు సంబంధించిన బాధలధికం. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటు చేసుకొంటుంది.




వృత్తి, ఉద్యోగాల్లో కోరుకొన్న మార్పుచేర్పులు జరిగే సూచనలు. లేదా నూతనోద్యోగ ప్రాప్తి. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. సంతాన కారణంగా మనశ్చింత. సరైన నిర్ణయాలు తీసుకోలేరు. మిత్రులతోకలిసి వినోదయాత్రలు చేసే అవకాశాలున్నాయి. వ్యాపార విస్తరణకు నూతన ప్రయత్నాలు చేస్తారు. బంధువుల మూలంగా చిరు ఖర్చులు. ఆరోగ్యం చక్కగా వుంటుంది.




శారీరక మానసిక బాధలు తప్పవు. వైద్యశాలలను సందర్శిస్తారు. గాయాలు తగిలే ప్రమాదముంది. బంధుమిత్ర సమాగమం ఊరటనిస్తుంది. వ్యాపారులకు గడచిన వారంలోకన్నా ఈవారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఇంటిలో వివాహ సంబంధ విషయాలు ప్రస్తావనకొస్తాయి. రాజకీయులకు దురదృష్ట కాలం.




మానసిక ఆందోళనకు గురౌతారు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఆరోగ్య విషయంలో శ్రద్ధ అవసరం. కుటుంబంలో కలతలకు అవకాశాలు. ధన విషయాలలో లోటు లేదు. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. ఉద్యోగులకు పై అధికారుల నుండి నిరాదరణ. రాజకీయులకు ఉత్తమ కాలం. వ్యాపారులకు మంచి లాభావకాశాలు. విద్యార్థులకు శ్రమ.

## పంచాంగం

17తేది ధనుర్మాసం ప్రారంభం.

**శుభ ముహూర్తాలు లేవు.**

**డిసెంబర్ తిథులు**

**మార్గశిర బహుళ**

| | | | |
|---|---|---|---|
| 17 | శని | సప్తమి | సా 05.02 గం.ల.వ |
| 18 | ఆది | అష్టమి | ప 02.57 గం.ల.వ |
| 19 | సోమ | నవమి | ప 12.49 గం.ల.వ |
| 20 | మంగళ | దశమి | ఉ 10.37 గం.ల.వ |
| 21 | బుధ | ఏకాదశి | ఉ 08.18 గం.ల.వ |
| | | ద్వాదశి | తె 06.10 గం.ల.వ |
| 22 | గురు | త్రయోదశి | తె 03.40 గం.ల.వ |
| 23 | శుక్ర | చతుర్దశి | రా 01.32 గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




అప్పుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. సోదరులతోటి సమస్యలు ఒక కొలిక్కి రావచ్చు. ఆర్థిక విషయాలు కొంత తృప్తికరంగా వుంటాయి. మోసానికి గురౌతారు. ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. వ్యాపారులు భాగస్వాముల వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి.




ఇంటిలో ఆనందదాయకమైన పరిస్థితులు చోటు చేసుకొంటాయి. అనవసరపు అప్రతిష్ఠలకు గురౌతారు. మాటలవల్ల వృథాగా ఇబ్బందులకు గురౌతారు. పురప్రముఖుల పరిచయం ఆనందాన్నిస్తుంది. మనశ్చాంచల్యం వుంటుంది. ఖర్చులధికం. విశ్రాంతి తక్కువ. ఆకస్మిక సంఘటనలకు అవకాశాలున్నాయి. ఆర్థికవృద్ధికి, పొదుపునకు సంబంధించి చేసే పనులు ఫలవంతమవుతాయి.




సంతాన మూలంగా, స్త్రీమూలంగా ధనప్రాప్తి. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. వారాంతంలో అధిక ఖర్చులు. పురోభివృద్ధి అన్ని రంగాలలో వుంటుంది. రాజకీయులకు అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాలనార్జిస్తారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు. అయినా ఓర్పు అవసరం. గౌరవమర్యాదలకు లోటు రావచ్చు.




అనుకొన్న పనులన్నీ అనుకొన్న రీతిలోజరుపుకొన్నా శ్రమ, అలసట అధికం. ఆహార విషయంలో జాగ్రత్త. పనుల్లో ఆటంకాలధికం. ధనాదాయం బాగుంటుంది. శత్రువులు లొంగి నడచుకొంటారు. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం గాదు. మనసు పరి పరి విధాల పయనిస్తుంది. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ.




శుభకార్యాలలో, విందు వినోదాలలో పాలు పంచుకొంటారు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. తొందరపాటు నిర్ణయాలు వద్దు. ఓపిక అవసరం. వివాహాది శుభ కార్య ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు బాగా సాగుతుంది. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగుండాలి. నూతన పరిచయాలు సత్ఫలితాలనిస్తాయి.




ఆరోగ్యం సక్రమంగా వుండదు. బయటవారి కోసం ఖర్చు చేస్తారు. ఆర్థిక విషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. ప్రయాణాలు వూహించని రీతిలో వుంటాయి. కొంత ప్రయత్నం తర్వాతే పనులు సాగుతాయి. ప్రతి పనిలో దూకుడు వద్దు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. వ్యాపారులకు అత్యంతం చక్కని కాలం. ఉద్యోగులకు మార్పులు చేర్పులు చోటు చేసుకొంటాయి.

# జ్యోతిశ్శాస్త్రంలో పంచమ భావదోషకాలు సర్పదోషాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎం.సుజాతరమణారావు బెంగుళూరు*

*★ సర్పదోషం ఎట్లా ఏర్పడుతుంది? ఇట్లాంటి దోషాలను గురించి చెప్పండి?*

పంచమ స్థానంలో జాతకరీత్యా 'రాహువు' ఉండి దానిపై కుజుని(అంగారకు)ని దృష్టి పడటాన్ని నాగదోషం ఏర్పడుతుందని జ్యోతిష శాస్త్రం చెబుతోంది. అవి పన్నెండు విధాలు.

*కోటి సునంద ఒంగోలు*

*★ ఫలిస్తున్న మామిడి వృక్షాన్ని నరికివేశారు. వృక్షవేధ వేధిస్తుందా?*

ఫల వృక్షం గర్భవతీ సమానమని శాస్త్రం. వృక్షవేధ మూడు, ఆరు, తొమ్మిది మాసాలైనా, సంవత్సరాలైనా పీడించవచ్చు.

*ఐ.రవికుమార్ నాయుడుపేట*

*★ వాస్తుశాస్త్ర అధ్యయనానికి తెలుగులో ప్రామాణిక గ్రంథాలేవి?*

తెలుగులో ప్రామాణిక గ్రంథం తొలి గ్రంథం మారేమండ రామారావుది. ద్వితీయ గ్రంథం శాస్త్రీయ గృహవాస్తు సర్వస్వం మామిడేల శ్రీరామ మూర్తిది. జ్యోతిష, వాస్తు ప్రభావాలు మనిషిపై 20 నుంచి 25 శాతం వరకుంటాయి.

*ఎం.చింతామణి కోవూరు*

*★ 'షోడశ' కర్మలు దేనితో ప్రారంభమై ఏ కర్మతో ముగుస్తుంది?*

గర్భాదానం, పుంగువనం, సీమంతం, జాతకర్మలతో ప్రారంభమై వివాహం, పైతృకం, స్నాతకాలతో ముగుస్తుంది.

*పి.హేరంభశాస్త్రి విజయవాడ*

*★ 'సింహేచ' శ్లోకంలో అర్థాన్ని మీరు సమన్వయపరచగలరా?*

'విశ్వకర్మ ప్రకాశిక' వాస్తు గ్రంథంలోని పై శ్లోకంలో పశ్చిమ దక్షిణ దిశా, శాలాద్వయం, ధన, సౌఖ్య లాభాల్నిస్తాయని, అదే దక్షిణ ఆగ్నేయం, పశ్చిమ వాయువ్యంలోని శాలలు సర్వనాశకారకాలని దీని తాత్పర్యం.

*సి.సుజాతమ్మ కర్నూలు*

*★ శిథిలమైన దేవుడి ఫోటోలు, పుస్తకాలు ఎక్కడ వదలివేయాలి?*

వేప, రావి, అశ్వత్థ వృక్షాల మొదట్లోగానీ, నాగబంధ శిలాప్రతిష్ఠల వద్దగానీ, ఆలయ ప్రదక్షిణ మార్గాలలోగానీ పై వాటిని వదలి వేయవచ్చు. దోషం లేదు.

*సయ్యద్ ఖాసింఅలీఖాన్ చెన్నై*

*★ ఏక నక్షత్ర వధూవరుల వివాహం చేయవచ్చునా?*

విశాఖ, శ్రవణం, మాఘ, రోహిణి, ఆర్ద్ర, రేవతి, ఉత్తరాబాద్ర, పుష్యమి నక్షత్రాష్టమి ఇద్దరికీ ఒకే నక్షత్రమైతే మహా శుభప్రదమని 'ధర్మసింధు' జ్యోతిష శాస్త్రం చెబుతున్నది.

*మహ్మద్ గౌసియాబేగం కావలి*

*★ ఈశాన్యంలో వృక్షం ఉంది. తీసివేయడానికి కొంత కాలం పడుతుంది. పరిష్కారం ఏమిటి?*

'వాస్తు యంత్రం' ప్రతిష్ఠ ఆరు మాసాల వరకూ వేధ్ దోషాన్ని నివారింపగలుగుతుంది. ఆ పిమ్మట వృక్షాన్ని తీసివేయాలి. చెట్టుకు పది మొక్కలు నాటి దాన్ని తీసివేయవచ్చునని విశ్వామిత్ర వాస్తు చెబుతున్నది.

*కె.డేవిడ్‌రాజు కందుకూరు*

*★ రోజుని 'సప్తస్థానము'లుగా విభజిస్తారట నిజమేనా?*

దినాన్ని పంచ విభాగాలుగా గణిస్తారు. అవి ప్రాతఃకాలం, సంగవం, మధ్యాహ్నం, అపరాహ్నం, సాయంత్రం. సప్తస్థానం తప్పు.

*సి.వి.తులసమ్మ కర్నూలు*

*★ 'యంత్ర ప్రతిష్ఠ' తర్వాత ఇప్పుడు అమ్మాయిని బాగా చూసుకుంటున్నారు.*

'నరఘోష' యంత్రం అమ్మాయి ప్రతిష్ఠించి, మండలం పూజ నిర్వహించింది కాబట్టి ఆ బాధలు నివారణ అయ్యాయి. స్త్రీలు యంత్ర ప్రతిష్ఠ చేస్తే వాళ్ల శక్తి స్వరూపాలవుతారు. అందువల్ల మగవాడి దుష్టతనం నశిస్తుంది.

*కె.ఎన్.తిరుపతిరెడ్డి నెల్లూరు*

*★ పశ్చిమం అంగడి. తూర్పు ఇల్లు. ఇలా ఉండవచ్చునా?*

ఇలా ఉంటే 'వ్యతిరిక్త వేధో' దోషమంటారు. ఏదో ఒక నిర్మాణంలోని వ్యత్యాసాలు ఆర్థిక, అనారోగ్య సమస్యలనెదుర్కోవలసి వస్తుంది. దీనికి 'సుదర్శన యంత్ర' ప్రతిష్ఠ ఉత్తమం.

● కరవు మండలాల్లోనూ

# భూమి శిస్తు వసూళ్లకు ఒత్తిడి!

**జిల్లాలో ప్రకృతి వైపరీత్యాలతో పంటలు పండని ప్రాంతాలను రాష్ట్ర ప్రభుత్వం కరవు మండలాలుగా ప్రకటించింది. కాని ఇక్కడి రైతులను నీటి తీరువా, భూమిశిస్తు చెల్లించమని రెవిన్యూ శాఖ సిబ్బంది ఒత్తిడి చేయడం విమర్శల పాలవుతోంది.**

ప్రకృతి వైపరీత్యాలతో పంటలు పండని ప్రాంతాలను రాష్ట్రప్రభుత్వం కరువు మండలాలుగా ప్రకటించింది. కరువు ప్రాంతాల్లోని రైతులు దుర్భర జీవనం సాగిస్తుంటే రెవెన్యూశాఖ నీటి తీరువా చెల్లించాలని రైతులపై వత్తిడి తెస్తుంది. ఒక ప్రక్క కరువు మండలాల్లో ప్రత్యేక ప్యాకేజీని అమలు చేయాలని ప్రభుత్వం భావిస్తుంటే చాప క్రింద నీరులా గ్రామ రెవెన్యూ అధికారులను భూమి శిస్తు వసూలు చేయాలని అధికారులు ఆదేశిస్తున్నట్లు ప్రచారం జరుగుతోంది. వ్యవసాయ పరపతి సంఘాలు, వాణిజ్య బ్యాంకుల్లో రైతులు తీసుకున్న వ్యవసాయ రుణాలు రీషెడ్యూల్ చేస్తామని ప్రభుత్వం ప్రకటించిన సంగతి తెలిసిందే.

జిల్లాలో ఇప్పటివరకు 15 మండలాలను కరువు మండలాలుగా ప్రకటించారు. గత నెలలో కరువు మండలాలకు ప్రత్యేకాధికారిగా నియమించబడిన మన జిల్లాలో గతంలో కలెక్టర్‌గా పని చేసి అనుభవం వున్న అనంతరాము జిల్లాలో పలు కరువు ప్రాంతాల్లో పర్యటించి వెళ్లారు. కరువు మండలాల్లో అమలు చేయాల్సిన పనుల గురించి ప్రభుత్వానికి పూర్తిస్థాయి నివేదిక సమర్పిస్తామని ఆయన ప్రకటించారు. ప్రభుత్వం వైపు నుంచి ఇప్పటివరకు కరువు ప్రాంతాల్లో తీసుకోబోయే చర్యల గురించి ప్రకటన వెలువడలేదు. అయితే తమ విధుల్లో భాగంగా భూమిశిస్తును వసూలు చేయకతప్పడం లేదని విఆర్వోలు వ్యాఖ్యానిస్తున్నారు. పై అధికారుల ఆదేశాల ప్రకారమే తాము శిస్తు వసూళ్లకు వెళ్తున్నట్లు చెబుతుండడం విశేషం.

రెవెన్యూశాఖ నిర్భంధంగా భూమిశిస్తు వసూళ్లకు పూనుకోవడంతో రైతులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. గతంలో తీసుకున్న బ్యాంకు రుణాలను రీషెడ్యూల్ చేసి అదనంగా రుణాలు అందించాల్సి వుంటుంది. అలాగే పశుగ్రాసం, విత్తనాల కొరత వున్న ప్రాంతాల్లో సబ్సిడీ క్రింద అందించాలని రైతులు కోరుతున్నారు. కరువు మండలాల ప్రకటనతో తమకేమి సంబంధం లేదన్న విధంగా రెవెన్యూ అధికారులు వ్యవహరిస్తున్నారు. ఇందుకు ఆర్డీఓలు కూడా పరోక్షంగా సహకారం అందిస్తున్నట్లు సమాచారం. గత పది సంవత్సరాల నుంచి అతివృష్టి, అనావృష్టితోపాటు ఇతర కారణాల వల్ల వేసిన వ్యవసాయ పంటల నుంచి రైతులు పెద్దగా ప్రయోజనం పొందలేకపోతున్నారు. ఇటీవల కురిసిన భారీ వర్షాలకు అనేక ప్రాంతాల్లో నారుమళ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి.

మెట్ట ప్రాంతాలతోపాటు తీర ప్రాంతాల్లోని రైతులు ఆర్థికంగా బాగా దెబ్బతినిపోయారు. వ్యవసాయ ఖర్చులు ప్రతి సంవత్సరం బాగా పెరిగిపోతున్నాయి. పంట దిగుబడి అంతంత మాత్రంగానే వుంటుంది. ఈ క్రమంలో ధాన్యానికి సరైన గిట్టుబాటు ధర వుండకపోవడంతో అప్పులు తీర్చేందుకు వేరే మార్గం లేకపోవడంతో తక్కువ ధరకే ధాన్యాన్ని విక్రయించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ప్రస్తుతం జిల్లాలో వరినాట్లు వేస్తుండగా, మరికొన్ని ప్రాంతాల్లో నారుమళ్లు పోసుకుంటున్నారు రైతులు. వ్యవసాయ ఖర్చుల కోసం రైతులు అనేక ఇబ్బందులు పడుతుంటే విఆర్వోలు భూమి శిస్తు చెల్లించాలని డిమాండ్ చేయడంపై ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

రెవెన్యూశాఖ చేపట్టిన చర్యల కారణంగా ప్రభుత్వానికి అప్రతిష్ట ఏర్పడే అవకాశం వుంది. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి కరువు మండలాల్లో భూమిశిస్తు వసూళ్లను నిలిపివేసేందుకు చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.



అమ్మకానికి ఉద్యోగాలు

● మార్కెట్‌లో దళారులు

# రెవిన్యూ ఉద్యోగాలు ఇప్పిస్తారట!

**ఎన్నో ఏళ్ల తర్వాత రెవిన్యూ శాఖలో ఉద్యోగాల భర్తీకి ప్రభుత్వం శ్రీకారం చుడితే ఈ ఉద్యోగాలను అధికార పార్టీ నాయకులకు చెప్పి ఇప్పిస్తామని పలువురు దళారులు రంగంలోకి దిగడం ఆందోళన కల్గిస్తోంది.**

ఎన్నో సంవత్సరాల అనంతరం రెవిన్యూ శాఖలో ఉద్యోగాల భర్తీకి ప్రభుత్వం శ్రీకారం చుడితే ఇందులో దళారుల బెడద అధికమైంది. రెవిన్యూ శాఖలో రాష్ట్రవ్యాప్తంగా ఖాళీగా ఉన్న గ్రామ రెవిన్యూ అధికారి(విఆర్వో) గ్రామ రెవిన్యూ అసిస్టెంట్(విఆర్ఏ) పోస్టుల భర్తీకి ఈ నెల 7వ తేది నోటిఫికేషన్ జారీ చేసింది ప్రభుత్వం. నోటిఫికేషన్ జారీకాక ముందు నుంచే రాజకీయ దళారులు కొందరు రంగప్రవేశం చేసి ప్రజా ప్రతినిధుల పేర్లు చెప్పి నిరుద్యోగులను మాయలో పడేసేందుకు ప్రయత్నాలు ప్రారంభించారు.

అధికార పార్టీకి చెందిన ఎమ్మెల్యేలతో సన్నిహితంగా మెలిగే వ్యక్తులు విఆర్వో పోస్టులు ఇప్పిస్తామని ప్రచారం మొదలు పెట్టారు. ప్రధానంగా గ్రామీణ ప్రాంతాలకు చెందిన నిరుద్యోగులు వీరి మాటలు నమ్ముతున్నారు. విఆర్వో, విఆర్ఏ పోస్టుల భర్తీకి రాత పరీక్షలు నిర్వహించి ఎంపిక చేస్తామని ఒక ప్రక్క అధికారులు ప్రకటిస్తున్నా ఎమ్మెల్యే సిఫార్సుతో పోస్టులు ఇప్పిస్తామని భరోసా ఇస్తున్నారు. విఆర్వో పోస్టుకు లక్ష రూపాయలు, విఆర్ఏ పోస్టుకు 75వేల రూపాయలు బేరసారాలు సాగుతున్నాయి. ఈ పోస్టులకు జిల్లాస్థాయిలో ఎంపికలు జరుగనుండడంతో అభ్యర్థులు దళారుల మాటలు నమ్మాల్సి వస్తుంది.

ఈ పోస్టులకు దరఖాస్తు చేసేవారందరూ ఆన్‌లైన్‌లోనే తమ వివరాలను నమోదు చేయాల్సి ఉంటుంది. విఆర్వో పోస్టులకు కనీస విద్యార్హత ఇంటర్ ఉత్తీర్ణతగా నిర్ణయించారు. ఈ పోస్టులు చాలా తక్కువగా ఉండడంతో అధిక సంఖ్యలో దరఖాస్తులు అందే అవకాశం ఉంది. వచ్చేనెలలో రాత పరీక్ష నిర్వహించే విధంగా ప్రణాళిక రూపొందించారు. గ్రామీణ ప్రాంతాలకు చెందిన అభ్యర్థులకు ఆన్‌లైన్ విధానంపై సరైన అవగాహనలేని కారణంగా రెవిన్యూ యంత్రాంగం ప్రత్యేక సహాయ కేంద్రాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. విఆర్వో, విఆర్ఏ పోస్టుల భర్తీలో మహిళలకే అధిక పోస్టులు కేటాయిస్తూ నోటిఫికేషన్ జారీ చేశారు.

జిల్లాలో 26 విఆర్వో పోస్టులు, 244 విఆర్ఏ పోస్టులు భర్తీ కానున్నాయి. ఈ ఎంపికలను ఎటువంటి అవకతవకలకు ఆస్కారం లేకుండా భర్తీ చేయాలని అధికార యంత్రాగం పటిష్టమైన చర్యలు చేపట్టింది. అయినా కూడా రాజకీయ దళారులు ఇవేమీ పట్టించుకోకుండా ఉద్యోగాలు ఇప్పిస్తామని రహస్యంగా చర్చలు జరుపుతున్నారు. నమ్మకం కలగాలంటే ముందుగానే బ్యాంకులో జాయింట్ ఖాతా ప్రారంభించి నగదు జమ చేయాలని చెబుతున్నారు. కొందరు నిరుద్యోగులు వీరి మాటలను నమ్ముతుండగా మరి కొందరు గతంలో జరిగిన అనుభవాలను దృష్టిలో ఉంచుకొని దళారులకు దూరంగా వుంటూ ప్రజాప్రతినిధుల చుట్టూ తిరుగుతున్నారు.

ప్రజాప్రతినిధులు ఉద్యోగ నియామకాల గురించి స్పష్టమైన హామీ ఇవ్వకపోయినా చూద్దాం! అంటూ చెప్పి పంపుతున్నారు. రాత పరీక్ష ఆధారంగా ఎంపిక చేస్తామని చెప్పిన అధికారులు ఇంటర్వ్యూ సమయంలో ఎటువంటి రాజకీయ ఒత్తిళ్లకు గురికాకుండా పారదర్శకంగా వ్యవహరించాలని నిరుద్యోగులు కోరుతున్నారు.





# హాట్‌భామ

బాలీవుడ్‌కు మరో హాట్‌భామ దిగుమతి అయ్యింది. పేరు... సన్నీలియోన్. కెనడాలో వీరి కుటుంబం స్థిరపడినా మూలాలు భారతదేశంలోనే వున్నాయట. ఈ భామని 'మర్డర్ 3'లో కథానాయికగా ఎంపిక చేసుకొన్నారు. ఈమెకు కెమెరా అనుభవం వుందా అంటే వుందనే చెప్పాలి. లియోన్ కొన్ని నీలి చిత్రాల్లో నటించింది. మర్డర్ అనగానే మల్లికా శెరావత్ పంచిన హాట్‌హాట్ దృశ్యాలే గుర్తొస్తాయి. అంతకు మించిన వేడి పుట్టించాలంటే ఈ నీలిచిత్రాల సుందరే సరైనదని అనుకొన్నట్లుంది మహేష్‌భట్. ఇదివరకు బాలీవుడ్‌లో నటించనని చెప్పిన లియోన్ ఇప్పుడు మాట మార్చింది. బాలీవుడ్ చిత్రాల్లో నటిస్తే గుర్తింపు త్వరగా వస్తుంది. అటువంటి అవకాశాలను ఎలా వదలుకొంటానని తెలివిగా చెబుతుంది.



# పోటీ సహజం

వరుస పరాజయాలతో ఇలియానా స్పీడు తగ్గింది. తెలుగులో అల్లు అర్జున్ సరసన నటిస్తున్న చిత్రంలో నటించను హైదరాబాద్ వచ్చిన ఆమె పిచ్చాపాటీగా మాట్లాడింది. పరిశ్రమలో పోటీ అనేది ఏమి వుండదు. ఎవరి సినిమాలు వాళ్లకి వుంటాయి. కొత్తగా వస్తున్న వాళ్లతో పోటీ అనుకోకూడదు. దేవదాసు, పోకిరి చేసేటప్పుడు నేను కూడా సినిమా రంగానికి కొత్తే. అయినా ఆదరించారు. పరిశ్రమలో అందరి జాతకాలు సినిమా విడుదలయ్యే శుక్రవారం ఫలితాలతో ముడిపడి వుంటాయి. ప్రధానంగా విజయమే మనకు ఉత్సాహాన్నిస్తుంది. అయినా నటిగా మనం ఏమిటో ఎప్పటికప్పుడు నటన ద్వారానే నిరూపించుకోవాలంది.



# ప్రేక్షకుల హృదయాల్లో స్థానం

ఎన్ని సినిమాలు చేశామన్నది ముఖ్యం కాదు. ప్రేక్షకుల హృదయంలో స్థానాన్ని సంపాదించామా లేదా అన్నది ప్రధానమంటుంది హీరోయిన్ సోనాక్షి సిన్హా. ఈ విషయమై మాట్లాడుతూ ఇంత తక్కువ వ్యవధిలో ఇంత ఆదరణ నేను ఏమాత్రం వూహించలేదు. మాస్‌లో మంచి గుర్తింపు వచ్చింది. అదొస్తే పరిశ్రమలో నిలబడిపోయినట్టే. నేను ఎప్పుడూ ఒకేలా వుండడానికి ఇష్టపడను. ఎంతోకొంత తేడా వుండాల్సిందే. తెరమీద చేసే పాత్రల ప్రకారమే మేం కనిపించాలి. బయట నా అభిరుచులకు తగ్గట్టు వుంటానంటుందీ భామ.

# జీవితం...సినిమా వేరు!



మొదట్లో అందరూ కాజల్ సోదరిగా గుర్తించినా ఇప్పుడు నిషా అగర్వాల్ మంచి నటి అని చెప్పడం ఆనందంగా వుంది. సోలో చిత్రం నాకు మంచి గుర్తింపు తెచ్చింది. ఈ సినిమాలో నా పాత్ర పోషణ సమయంలో ఔరంగాబాద్‌లో కాలేజి రోజులు గుర్తుకొచ్చాయి. ప్రత్యేకంగా ఫలానా పాత్రల్లోనే నటించాలనే లక్ష్యాలు నాకు లేవు. నా వద్దకు వచ్చే పాత్రలు మనసుకు నచ్చాలి. వాటికి పూర్తిగా న్యాయం చేసేలా నటిస్తే చాలు. అదే సంతృప్తినిస్తుంది. ప్రేమకథల్లో నటించినంత మాత్రాన ఎవరినైనా ప్రేమించాలనే నియమం ఏముంది? జీవితం, సినిమా రెండూ వేరంటుంది.

# హిందీలో కాంచన



తెలుగు, తమిళ భాషల్లో విజయవంతమైన కాంచన చిత్రాన్ని హిందీలోనూ నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో షారూఖ్ ఖాన్ హీరో. శరత్‌కుమార్ చేసిన పాత్రను సంజయ్‌దత్ పోషిస్తారు. హిందీలోనూ లారెన్స్ దర్శకుడు. తెలుగులో లారెన్స్ దర్శకత్వంలో తయారవుతున్న రెబెల్ చిత్రం షూటింగ్ ముగియగానే ఈచిత్రం షూటింగ్ మొదలవుతుంది.




✍ అల్లూరు రహీం




హీరో పవన్‌కళ్యాణ్ అంటే వినోదం, హుషారైన నటనకు నిర్వచనం. ఎంత సీరియస్ పాత్రైనా సరే అందులో తన మార్కు ఎంటర్‌టైన్‌మెంట్ ఉండి తీరాల్సిందే. అదే ఆయన్ను పవర్‌స్టార్‌ను చేసింది. అయితే ఈ మధ్య విడుదలైన ఆయన చిత్రాలు వరుసగా విఫలమవుతున్నాయి. తాజాగా విడుదలైన పంజా చిత్రం కూడా ఈ కోవలోనే చేరిపోయింది. పంజా చిత్రానికి తమిళంలో 'బిల్లా' వంటి స్టైలిష్ చిత్రాన్ని తీసిన విష్ణువర్ధన్ దర్శకుడు.

పంజాలో సరైన కథ లేకపోవడంతో ఆయన స్టైలిష్ తళుకులు ప్రేక్షకులు మెచ్చ లేదు. గడ్డంతో సినిమా అంతా పవన్‌కళ్యాణ్ కనిపించడం, హీరోయిన్ సారాజేన్ దియాస్ ఆకట్టుకునేలా లేకపోవడం, పాటలు సరిగ్గా కుదరకపోవడం చిత్రాన్ని బలహీన పర్చాయి. ద్వితీయార్ధం బ్రహ్మానందం పెట్టి లాగించే ప్రయత్నం చేశారు. దీని బదులు చిత్రనిడివి తగ్గించి వుంటే బాగుండేది. వాస్తవంగా చెప్పుకోవాలంటే బ్రహ్మానందం ఎపిసోడ్ సినిమాలో లేకుంటే చిత్రం చూడడం కష్టమయ్యేది. ఈ చిత్రానికి దర్శకుడు విష్ణువర్ధన్, మాటల రచయిత అబ్బూరి రవి కలసి వ్రాసిన స్క్రీన్‌ప్లే స్లోగా సాగుతుంది. చంద్రబోస్, రామజోగయ్య శాస్త్రి వ్రాసిన పాటల్లో ఐటమ్‌పాట 'ఏయ్‌రా' బాగుంది. ఈ పాటతోపాటు ఈ చిత్రంలో రెండవ హీరోయిన్‌గా సాగిన కింగ్‌ఫిషర్ క్యాలెండర్ సుందరి అంజలి లావనియా యువ ప్రేక్షకులను ఆకర్షిస్తుంది. టైటిల్‌సాంగ్ 'పంజా' సినిమా అయ్యాక తెరపై ప్రత్యక్షం కావడం ప్రేక్షకులకు విచిత్రంగా తోస్తుంది. పవన్‌కళ్యాణ్ చిత్ర పరిశ్రమలోనికి ప్రవేశించి 15ఏళ్లు పూర్తయ్యాయి. ఇక ఆయనకు లవర్‌బాయ్ పాత్రలు కుదరవని పంజా చిత్రం స్పష్టం చేసింది. ఆయన కథల ఎంపిక విషయమై తన పంథా మార్చుకుంటే మంచిది. మాటల రచయిత అబ్బూరి రవి ఈ చిత్రంలో వ్రాసిన గొప్పడైలాగు సాయంచేసిన వాళ్లపట్ల కృతజ్ఞత చూపాలన్నదే. ఈ డైలాగును ఆయన ఎక్కడో విని వ్రాసిందేనని అందరికీ తెలుసు. కలకత్తాలోని సందుగొందులు, పాత ఇళ్లపై కష్టపడి సన్నివేశాలు చిత్రీకరించిన కెమెరామెన్ వినోద్‌ను అభినందించాలి. తమిళంలో మంచి సంగీత దర్శకునిగా పేరు తెచ్చుకొన్నా తెలుగులో దాన్ని తెచ్చుకోవడంలో యువన్ శంకర్‌రాజా విఫలమయ్యాడు.

చిత్రకథలోనికి వెళ్తే కలకత్తాలో పేరు మోసిన గ్యాంగ్‌స్టర్ భగవాన్ (జాకీ షరాఫ్) అనాధ అయిన జై(పవన్ కళ్యాణ్)ను చిన్నతనంలో చేరదీస్తాడు. కష్టసమయంలో తనకు అండగా నిలచిన భగవాన్ పట్ల ఎనలేని భక్తిభావంతో అతని అండర్‌గ్రౌండ్ వ్యాపారాలన్నీ జై చక్కబెడుతుంటాడు. భగవాన్ దగ్గర కొన్నాళ్లు పని చేసి వేరే గ్యాంగ్ పెట్టుకొనే కులకర్ణి (అతుల్ కులకర్ణి)కి సైతం జై అంటే వణుకు. విదేశాల్లో వుండే భగవాన్ కుమారుడు మున్నా(అడవి శేషు) ఇండియా వస్తాడు. తనలా తన కుమారుడ్ని జాగ్రత్తగా చూసుకోమని 'జై'ను కోరుతాడు భగవాన్. కాని మున్నా శాడిస్ట్. ఒక డీల్ విషయంలో కులకర్ణి సోదరుడు సంపత్ కుమారుడు రాహుల్‌ను జై నిర్భంధిస్తాడు. అతడిని కుంటిసాకుతో కాల్చి చంపుతాడు మున్నా. జైను ఎంతో ఇష్టపడే జాన్వీ(అంజలి లావనియా)ను చంపేస్తాడు. దీంతో మండిన జై అతడ్ని కాల్చి చంపేస్తాడు. ఈ విషయం తెలుసుకొన్న భగవాన్ అగ్గిమీద గుగ్గిలమవుతాడు. ఇక్కడే వుండే గురు (తనికెళ్ల భరణి) భగవాన్, జైల మధ్య ద్వేషం ఇంకాస్త పెరిగేలా చూస్తాడు. దీంతో జై కలకత్తాలో వుండలేక తనను మౌనంగా సంధ్య(సారాజేన్) స్వగ్రామం పలాసకు వచ్చేస్తాడు. చెట్లను ప్రేమించే సంధ్యపై గంధపు చెక్కల స్మగ్లర్ సాంబశివుడు ద్వేషం పెంచుకొంటాడు. ఇతన్ని జైనే చంపి ఈ పని ఎస్ఐ పాపారాయుడు (బ్రహ్మానందం) చేసినట్లు సీన్ క్రియేట్ చేస్తాడు. జైను వెతుక్కొంటూ పలాస వచ్చే భగవాన్, కులకర్ణి గ్యాంగులు సంధ్యను కిడ్నాప్ చేస్తాయి. తనకు ఈ లోకంలో ఏకైక స్నేహితురాలిని గ్యాంగ్‌స్టర్ల చెర నుంచి విడిపించను మహోగ్రంగా కలకత్తా బయలుదేరి వెళ్లే 'జై' శత్రుమూకలను మట్టి కరిపించడంతో చిత్రం ముగుస్తుంది.

పంజాలో పవన్‌కళ్యాణ్ నటన బాగున్నా గడ్డం వల్ల ఆయన ముఖ వర్చస్సులో కళ లేదు. హీరోయిన్లు సారాజేన్, అంజలి లావనియాల గ్లామర్ ఈ చిత్ర విజయానికి ఉపయోగపడలేదు. జాకీషరాఫ్ ఏ తెలుగు చిత్రంలో నటించినా ఆ చిత్రం ఆడదని పంజాతో ఇంకోసారి నిరూపణ అయ్యింది. మూడుగంటలపాటు సుత్తి భరించగలమని ధైర్యమున్న వాళ్లు పంజాకు నిరభ్యంతరంగా వెళ్లొచ్చు.

# ఆగని బియ్యం అక్రమ రవాణా!

**ఉదాసీనంగా పౌరసరఫరాల శాఖ**

జిల్లాలో బియ్యం అక్రమ రవాణా జోరందుకొంటుంది. అధికారులు ఎన్ని దాడులు చేస్తున్నా ప్రక్కదారి పడుతూనే ఉంది. రోజుకొక క్రొత్త మార్గాలను అన్వేషిస్తూ కొందరు డీలర్లు, బియ్యం వ్యాపారులు జేబులు నింపుకొంటున్నారు. మొన్నటివరకు రేషన్ బియ్యాన్ని బ్లాక్‌మార్కెట్‌కు తరలించి లక్షలు గడిస్తున్న అక్రమార్కుల కన్ను ఇప్పుడు మధ్యాహ్న భోజన పథకం బియ్యంపై పడింది. కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహకారంతో రాష్ట్ర ప్రభుత్వం నిర్వహిస్తున్న మధ్యాహ్న భోజన పథకానికి వివిధ ప్రాంతాల నుంచి బియ్యాన్ని సేకరించి ఆయా మండల కేంద్రాలకు తరలిస్తారు. విద్యార్థులకు ఆహారాన్ని అందించే బియ్యం నాణ్యమైనదిగా ఉండేలా చూస్తుంది ప్రభుత్వం. ఈ బస్తాలపై మిడ్ డే మీల్స్(ఎండిఎం) అనే స్టిక్కర్ వేసి ఉంటుంది. ఇటీవల కొందరు అక్రమ వ్యాపారులు ఈ బియ్యాన్ని ప్రక్కదారి పట్టించి వీటి స్థానంలో కిలో రూపాయికి ఇచ్చే బియ్యాన్ని పాఠశాలలకు అందేలా చాకచక్యంగా చేరవేస్తుండడంతో పరమ నాసిరకంగా ఉండే ఆ బియ్యాన్ని వండి పెడుతుండడంతో దానిని తినలేక విద్యార్థులు పస్తులుంటున్నారు పలు ప్రాంతాలలో. వీరికి కొందరు సివిల్ సప్లయిస్, రెవిన్యూ సిబ్బంది సహకారం ఉందనే ఆరోపణలు వినవస్తున్నాయి. జిల్లావ్యాప్తంగా 2,61,274 మంది విద్యార్థులకు మధ్యాహ్న భోజన పథకం ద్వారా ఆహారాన్ని అందిస్తున్నారు. నెలకు 595 మెట్రిక్ టన్నుల బియ్యం అవసరమవుతున్నట్లు గణాంకాలు చెప్తున్నాయి. విద్యార్థులు ఎంత మంది అనే వివరాలు జిల్లా విద్యాశాఖాధికారి నెల నెలా పౌరసరఫరాల శాఖ అధికారికి అందిస్తే ఆయన కోటా ప్రకారం ఆయా మండలాల డిప్యూటీ తహశీల్దార్ల ఆధ్వర్యంలో మధ్యాహ్న భోజన నిర్వాహకులకు అందేలా చూస్తారు. పేద విద్యార్థుల ఆకలి తీర్చేందుకు ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఈ పథకాన్ని తమకు అనుకూలంగా మలచుకొని లబ్ధిపొందేందుకు డీలర్లతో కుమ్మక్కై వ్యాపారులు రూపాయికి కిలో బియ్యం పంపిణీ జరిగేలా చూడడం బాధాకరం.

# సమస్యలు సృష్టిస్తున్న అండర్ బ్రిడ్జిలు!

**● చిన్నపాటి వర్షం పడితే రాకపోకలు నిలిచిపోతాయి**



వర్షపు నీటితో నిండిపోయిన మాగుంట లేఅవుట్‌లోని అండర్ బ్రిడ్జి(ఫైల్‌ఫోటో).

పేరు గొప్ప ఊరు దిబ్బ అన్న చందంగా ఉంది సింహపురి సోయగం. అడుగడుగునా గుంటలు, ఎటుచూసినా చెత్తకుప్పలు, మురుగునీరు ఇదీ సింహపురి చిత్రం. ముఖ్యంగా వర్షం వస్తే పలు ప్రాంతాలకు రాకపోకలు స్తంభించిపోతున్నాయి. దీనికి కారణం నగరంలో ఫ్లైవర్ బ్రిడ్జిలు లేకపోవడమేనన్నది తెలిసిన సంగతే. తూర్పు, పడమర ప్రాంతాలను కలుపుతూ ఉండే అండర్ బ్రిడ్జిలు వానొస్తే ఎందుకూ పనికి రాకుండా పోతున్నాయి. ఆత్మకూరు బస్టాండ్ వద్ద ఉన్న అండర్ బ్రిడ్జి, విజయమహల్ గేటు వద్ద గల బాక్స్‌టైప్ బ్రిడ్జి, రామలింగాపురం అండర్ బ్రిడ్జి, మాగుంట లేఅవుట్‌లో గల అండర్‌బ్రిడ్జిల నుంచి రెండు ప్రాంతాలకు రాకపోకలు సాగిస్తుంటారు. అయితే విజయమహల్ గేటు, రామలింగాపురం అండర్ బ్రిడ్జిల వద్ద నిత్యం డ్రైనేజీ వాటర్ పొంగి పొర్లుతుంటుంది. దీనికితోడు నాలుగు చినుకులు పడినట్లయితే చాలు బ్రిడ్జిల నిండా నీరు చేరుతుంది. దీంతో రాకపోకలకు తీవ్ర ఆటంకం ఏర్పడుతుంది. దాదాపు బ్రిడ్జి పై వరకు నీరు చేరుతుండడంతో రెండు, మూడు రోజులు ట్రాఫిక్ సమస్యలు తప్పడం లేదు. నగరంలో వివిధ ప్రాంతాలకు వచ్చిపోయేవారు అటు రంగనాయకులపేట మీదుగా గానీ, లేదంటే అయ్యప్పగుడి ఫ్లైవర్ మీదుగాగానీ రావాల్సి వస్తుండడంతో ప్రజలు అసౌకర్యానికి గురవుతున్నారు. మైకు పట్టుకుంటే పూనకం వచ్చినట్లు హామీల మీద హామీలు గుప్పించే ప్రజాప్రతినిధులు, అధికారులకు నగర ప్రజలు చాలా కాలంగా ఎదుర్కొంటున్న ఈ సమస్య మాత్రం పట్టడం లేదు. ఇప్పటికైనా అండర్ బ్రిడ్జిల పుణ్యమా అంటూ రాకపోకలకు ఎదురయ్యే ఇబ్బందులను తొలగించేందుకు ప్రత్యామ్నాయ మార్గాలైన ఫ్లైవర్ బ్రిడ్జిల ఏర్పాటు పట్ల శ్రద్ధ చూపాలని పలువురు ప్రజలు కోరుకొంటున్నారు.

# నిద్రావస్థలో పోలీసు నిఘా



ఆచారివీధిలో హత్యకు గురైన కుదువ వ్యాపారి శవాన్ని పరిశీలిస్తున్న సిఐ వీరాంజనేయరెడ్డి.

పోలీస్ నిఘా విభాగం నిద్రావస్థలో ఉంటున్నది అనేందుకు ఇటీవల జరుగుతున్న ఘటనలే ఉదాహరణ. రెండు వారాల వ్యవధిలో నగరంలో ఇద్దరిని హత్య చేశారు. రోజూ ఎక్కడో దగ్గర చైన్ స్నాచింగ్, దొంగతనాలు జరుగుతూనే ఉన్నాయి. బ్యాంకుల దగ్గర్నుంచి నగదు తీసుకెళ్లే వారిని బురిడీ కొట్టించే కేసులు అధికం అవుతున్నాయి. ఇంత జరుగుతున్నా పోలీసులు వీటిని అరికట్టేందుకు పటిష్టమైన చర్యలు చేపట్టలేదనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ఎందరు ఎస్పీలు మారినా శాంతి భద్రతలను కాపాడడంలో విఫలమౌతూనే ఉన్నారన్న విషయం చెప్పక తప్పదు. క్రిందిస్థాయి సిబ్బందికి వారు చేసే ఆదేశాలు, హెచ్చరికలు ఏమాత్రం చెవికి ఎక్కడం లేదు. ఎంతసేపటికీ కాసులు కురిపించే సెటిల్‌మెంట్లపై ఉన్న శ్రద్ధ కేసులను ఛేదించడంలో, శాంతి

**ఆచారివీధిలో కుదువ వ్యాపారి హత్య విస్తుపోయేలా చేస్తుంది**

భద్రతలను కాపాడడంలో సిబ్బంది శ్రద్ధ పెట్టకపోవడంతో ఉన్నతాధికారుల ఆదేశాలు ఏమాత్రం ఫలితాలనివ్వడం లేదు. బెట్టింగ్‌ల నిర్వాహకులతో ఒప్పందం కుదుర్చుకొని వారి నుంచి మామూళ్లు దండుకోవడం, పేకాట కేంద్రాల నుంచి దండకాలు, దాబాల నిర్వాహకులు అర్ధరాత్రి దాకా తెరచి ఉంచుతూ మద్యం అమ్ముతున్నా వారిచ్చే ముడుపులు అందుకొని ఎప్పుడో ఒకసారి దడబడలు సృష్టించడం మినహా ఇతర విధులపై దృష్టిసారించక పోవడంతో పోలీసులపై ప్రజలకే నమ్మకం లేకుండా పోతుంది. కొందరు ఎస్‌ఐలు, సిబ్బంది రియల్ ఎస్టేట్ వ్యాపారాల్లో తలమునకలై ఉంటున్నారు. వీరికి కాసులపై ఉన్న శ్రద్ధ కేసులపై ఉండకపోవడంతో నగరంలో శాంతిభద్రతలు క్షీణించాయనే చెప్పాలి. ఇటీవల ఓ ప్రభుత్వ ఉద్యోగిని మినీ బైపాస్‌లో హత్యచేసిన ఘటన మరువక ముందే తాజాగా నిత్యం రద్దీగా ఉండే కలెక్టర్ ఆఫీస్ వద్ద కుదువ వ్యాపారి దారుణ హత్య జరిగింది. ఇవి కాకుండా దొంగతనాలు, దోపిడీలు అధికం అవుతున్నాయి. ఇంత జరుగుతున్నా నిఘా వ్యవస్థ తగిన విధంగా వ్యవహరించకపోవడంతో సంఘ విద్రోహులు పెట్రేగిపోతున్నారు.

# దీర్ఘకాలిక వ్యాధుల పథకానికి మాయరోగం!

**పేరుకే ఈ పథకం**

దీర్ఘకాలిక వ్యాధులకు మెరుగైన వైద్యం అందించాలన్న లక్ష్యంతో కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన నాన్ కమ్యూనికబుల్ డిసీజెస్ (ఎన్‌సిడి) పథకం ఆరంభ శూరత్వంగా మారింది. జాతీయ అసంక్రమిత వ్యాధుల నియంత్రణ సంస్థ ద్వారా ప్రతిష్టాత్మకంగా అమలు చేయాలని భావించి రాష్ట్రంలో రెండు జిల్లాలను ఎంపిక చేయగా అందులో నెల్లూరు ఒకటి. పెద్దాసుపత్రిలో దీనికోసం ఒక విభాగాన్ని కేటాయించారు. 20 పడకలు సిద్ధం చేశారు. ఈ పథకం క్రింద గుండె జబ్బులు, క్యాన్సర్, రక్తపోటు, పక్షవాతం, మధుమేహం తదితర దీర్ఘకాలిక వ్యాధులకు మెరుగైన వైద్యాన్ని అందించాలి. అయితే నిధులు లేకపోవడం, సిబ్బంది నియామకం జరగకపోవడంతో ఎన్‌సిడి పథకం ఎవరికీ ఉపయోగపడకుండా ఉంది. ఈ వ్యాధుల బారినపడిన వారిని గుర్తించేందుకు వెంకటగిరి, సూళ్లూరుపేట, కోట, రాపూరు, ఆత్మకూరు, ఉదయగిరి తదితర ప్రాంతాలలోని ప్రభుత్వ ఆస్పత్రులను ఎంపిక చేశారు. ఇక్కడ పని చేసే సిబ్బంది ఆయా ప్రాంతాలలో తిరిగి వ్యాధిగ్రస్తులను గుర్తించి వారికి జిల్లా కేంద్రంలో గల ఎన్‌సిడి విభాగంలో చికిత్స అందించాలి. అయితే జిల్లా కేంద్రంలో ఈ వ్యాధులకు చికిత్స అందించేందుకు స్పెషలిస్టు డాక్టర్‌తోపాటు ఆరుగురు వైద్యులు, 14 మంది నర్సింగ్ సిబ్బంది, ఫిజియోథెరపిస్ట్, ఇతర సిబ్బంది నియామకం జరగాల్సి ఉండగా ఇంతవరకు వాటిని భర్తీ చేయకపోవడంతో ప్రభుత్వ ఉద్దేశం మాటలకే పరిమితం అవుతుంది తప్ప అమలుకు నోచుకోవడం లేదు. నిధులు విడుదల కాకపోవడం సమస్యగా పరిణమిస్తోంది.

**● తూతూ మంత్రంగా**

# కులగణన సర్వే!

**● క్షేత్రస్థాయిలో పర్యటించని ఎన్యుమరేటర్లు!**

జిల్లాలో రెండవ విడత సామాజిక, ఆర్థిక, కులగణన సర్వే కార్యక్రమానికి అధికార యంత్రాంగం శ్రీకారం చుట్టింది. తొలి విడత 12 మండలాల్లో కులగణన సర్వే చేపట్టారు. ముందుగా నిర్ణయించిన తేదీ కంటే 15 రోజులు ఆలస్యంగా ఈ సర్వే జరిగింది. మండలస్థాయి అధికారుల నిర్లక్ష్యం కారణంగా తొలి విడత సర్వే సక్రమంగా జరగకుండా పోయింది. అవగాహనలేని సిబ్బందిని ఈ సర్వే కార్యక్రమానికి నియమించడమే ఇందుకు కారణం. మిగిలిన మండలాల్లో రెండవ విడత సర్వే కార్యక్రమంలో లోటుపాట్లు తలెత్తకుండా అన్ని చర్యలు తీసుకోవాలని కలెక్టర్ ఆదేశించినా అధికారులు పట్టించుకోవడం లేదు. రెండవ విడతకు కూడా అవగాహన లేని వారిని నియమించారు. ఇంటింటి సర్వే చేసేందుకు ఎన్యుమరేటర్‌తోపాటు కంప్యూటర్ ఆపరేటర్‌ను నియమించడం జరిగింది. సర్వేచేసే విధానంపై ముందుగా రూపొందించిన అంశాలను కంప్యూటర్‌లో నమోదు చేయాల్సి ఉంటుంది. గ్రామంలోని ఓటరు జాబితా ఆధారంగా సర్వే చేస్తుండడంతో గందరగోళ పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

# వడ్డీలేని రుణం అందేనా?

**శ్రీనిధి బ్యాంకు ఏర్పాటు ఎప్పుడు!**

రాష్ట్ర ప్రభుత్వం శ్రీనిధి ద్వారా పొదుపుగ్రూపు మహిళలకు వడ్డీలేని రుణం అందిస్తామని ప్రకటించింది. శ్రీనిధి బ్యాంకు ద్వారా 5 లక్షల రూపాయల లోపు రుణం పొందిన వారు క్రమం తప్పకుండా వాయిదాలు చెల్లిస్తేనే వడ్డీ వర్తిస్తుందని నిబంధన విధించారు. అయితే జిల్లాలో ఎంత మందికి వడ్డీలేని రుణం అందిస్తామన్న సంగతి అధికారులు ప్రకటించలేదు. గతంలో పావలావడ్డీ వర్తింప చేస్తామన్న ప్రభుత్వ ప్రకటన సక్రమంగా అమలు చేయలేక పోయింది. నిధుల కొరత ఏర్పడడంతో వేలాది పొదుపు సంఘాలకు పావలావడ్డీ అందించలేని పరిస్థితి ఏర్పడింది. తాజాగా మహిళలను ప్రభుత్వం వైపు తిప్పుకునేందుకు శ్రీనిధి బ్యాంకును ఏర్పాటుచేసి రుణాలు అందిస్తామని ముఖ్యమంత్రి ప్రకటించడంపై ఆశ్చర్యం కలిగిస్తుందని మహిళలు వ్యాఖ్యానిస్తున్నారు. బ్యాంకు లింకేజి ద్వారా తీసుకున్న రుణాలు కొంతమంది వివిధ కారణాల చేత చెల్లించలేకపోయారు. కొత్త పథకం ఏ మేరకు మహిళలకు లబ్ధి చేకూరుస్తుందో వేచి చూడాలి.

## కోర్టులతో రాజకీయ క్రీడ

మొదటి పేజీ కొరవ

మరొక ప్రక్క సిబిఐ దర్యాప్తు వల్ల కల్గుతున్న ఇబ్బందులను తప్పించుకోవడానికి పలురకాల లీగల్ పాయింట్లతో రకరకాల కోర్టులలో రకరకాల కేసులు దాఖలు చేయిస్తున్నాడు జగన్. విజయ సాయిరెడ్డి పేరిట సిబిఐ కోర్టు, హైకోర్టు, ఢిల్లీ హైకోర్టు, సుప్రీంకోర్టులలో రోజుకొక కేసు వేస్తున్నారు. ఇది చాలక హైకోర్టులో చంద్రబాబుకు అనుకూలంగా ఉత్తర్వులు రాకుండా నిరోధించడానికి సాక్షి పత్రికలో న్యాయవ్యవస్థ మీద ముప్పేట దాడి మొదలు పెట్టారు. హైకోర్టు న్యాయమూర్తుల మీద, వారి పేర్లు పెట్టి మరీ పుంఖాను పుంఖాలుగా వార్తా కథనాలు ప్రచురిస్తున్నారు. పరుషమైన వ్యాఖ్యలు చేస్తున్నారు. అప్పటికీ తృప్తి తీరలేదేమో... అసలు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అంటేనే తనకు నమ్మకం లేదని సుప్రీంకోర్టులో తన తల్లి విజయమ్మ చేత ఒక కేసు దాఖలు చేయించాడు జగన్.

జగన్ అవినీతిపరుడా, చంద్రబాబు అవినీతిపరుడా అన్న వివాదం మరుగునపడి పోయింది. ఇద్దరి అక్రమాలపై న్యాయస్థానంలో జరగవలసిన నిర్ధారణ పక్కకుపోయింది. ఏది నిజం, ఏది అసత్యం అన్న వాస్తవాన్ని తెలుసుకొనే అవకాశం ప్రజలకు లేకుండా పోయింది. విచారణను ఆపుకోవడానికి, దర్యాప్తులకు ప్రతిబంధకాలు కల్పించడానికి, ఆత్మరక్షణ కోసం, ప్రతీకార కక్షలు తీర్చుకోవడం కోసం న్యాయస్థానాలతో ఫుట్‌బాల్ ఆట ఆడుతున్నారు. కబడ్డీ క్రీడకు దిగుతున్నారు.

న్యాయ వ్యవస్థ చరిత్రలోనే ఇటువంటి అవాంఛనీయ రాజకీయ రగడ ఇదివరకెన్నడూ జరగలేదు. దేశంలో చాలా రాష్ట్రాలున్నాయి. వాటిలో చాలా రాజకీయ పార్టీలున్నాయి. లెక్కలేనంత మంది నాయకులున్నారు. వారి మధ్య తీవ్రమైన రాజకీయ స్పర్ధలున్నాయి. పోటాపోటీ ఉంది. కానీ వారెవ్వరు కూడా తమ రాజకీయ ప్రయోజనాల కోసం న్యాయస్థానాల మీద ఆధారపడడం లేదు. వాటిని ఇరకాటంలో పెట్టడం లేదు. కానీ అటు చంద్రబాబు, ఇటు జగన్‌లు ఇద్దరూ కేవలం న్యాయస్థానాల ద్వారా మాత్రమే రేపటి ఎన్నికలలో తమ అదృష్టాన్ని పరీక్షించుకోవాలనే స్థాయిలో ప్రయత్నం చేస్తున్నారు. నిజానికి చంద్రబాబు మొదట కొంత సంశయం చూపాడు. జగన్ తల్లి విజయమ్మ తన మీద వేసిన కేసులో తీర్పు ప్రకారం సిబిఐ దర్యాప్తుకు సిద్ధపడ్డాడు. కానీ ఆయనతో పాటు జగన్ కలగలిపిన వ్యాపార, పారిశ్రామికవేత్తలు అంత ఉదారత చూపలేక పోయారు. ఒకసారి సిబిఐ దర్యాప్తు మొదలైతే తమ వ్యాపారాలలోని లొసుగులన్నింటినీ వెలికితీసి, భ్రష్టుపట్టిస్తారన్నది వారి భయం. సిబిఐ దర్యాప్తు జరుగుతున్నదని తెలిస్తే ఒక్క బ్యాంక్ సహకారం అందించదు. ఒక్క ప్రైవేట్ ఈక్విటీ పెట్టుబడిదారు వాటాలు కొనడానికి ముందుకు రాడు. వారి వ్యాపారాలన్నీ చిన్నాభిన్నమై పోతాయి. ఆ భయంతోనే చంద్రబాబును ఒప్పించి మరీ విజయమ్మ కేసును న్యాయపరంగా ఎదుర్కోవడానికి సిద్ధపడ్డారు. దానికి ప్రతిగా జగన్ విజయమ్మ చేత హైకోర్టు మీద తనకు నమ్మకం లేదనే తీవ్రమైన ఆరోపణతో సుప్రీంకోర్టు గడప తొక్కించాడు.

జగన్, చంద్రబాబులలో ఎవరి వాదన సహేతుకమనే చర్చ అనవసరం. ఇద్దరిలో ఎవరు సరైన వారు, ఎవరు అక్రమార్కులనే మీమాంస అనవసరం. ఇద్దరూ కలిసి న్యాయవ్యవస్థను ఇంతగా బజారుకు ఈడ్చడం మాత్రం బాధ కల్గిస్తున్నది.

వీరిద్దరి రాజకీయ క్రీడకు రాష్ట్ర హైకోర్టు నిస్సహాయంగా బలైపోవడం దురదృష్టకరం. జగన్ మీద వచ్చిన ఆరోపణలపై విచారణకు ఆదేశించాము కాబట్టి, చంద్రబాబు మీద వచ్చిన వాటిమీద కూడా అదే రకమైన ఉత్తర్వు ఇవ్వాలనే ఒత్తిడి పరోక్షంగా అయినా పని చేయబట్టే హైకోర్టు ఆ ప్రకారం ఉత్తర్వులిచ్చిందనే అభిప్రాయం ఒకటి ఉంది. ఈ తొందరలో వారు సహజ న్యాయ సూత్రాలను విస్మరించి, చంద్రబాబు బృందానికి కనీసం తమ వాదన వినిపించుకొనే అవకాశం కూడా ఇవ్వకుండా తొందర పడబట్టే ఈ రోజు హైకోర్టులో ఇన్ని వ్యాజ్యాల ముళ్ల కంప తయారైందన్నది వాస్తవం.

న్యాయస్థానాలు పరమ పవిత్రమైనవి. వాటి మీద కూడా అప్పుడప్పుడు అవినీతి ఆరోపణలు, తీర్పుల మాయాజాలాల వంటి ఆరోపణలు వస్తున్నప్పటికీ, స్థూలంగా న్యాయవ్యవస్థ ఇప్పటికీ పవిత్రంగానే ఉందనే నమ్మకం ప్రజలకుంది. దాన్ని పాడు చేయచూడడం, ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేయడంతో సమానం. అటు జగన్, ఇటు చంద్రబాబులు కొంతమేర అయినా విజ్ఞత చూపి ఈ న్యాయస్థానాల క్రీడకు ముగింపు పలకడం అవసరం.

## ఎమ్మెస్‌రెడ్డి

మొదటి పేజీ కొరవ

రంగానికి వెళ్లకుంటే ఆయన జిల్లాలో పెద్ద రాజకీయవాదిగా ఎదిగి ఉండేవాడు. ఆయన ఎన్నో సినిమాలు తీశాడు. వాటిలో కొన్ని చాలా సాహసోపేతమైనవి. బాల రామాయణం చిత్ర నిర్మాణం ఎమ్మెస్ రెడ్డికి స్వర్ణకమలం సంపాదించి పెట్టింది. జాతీయ స్థాయిలో ఆ గౌరవం అందుకొన్న ఏకైక నెల్లూరీయుడు ఆయన. జీవిత చరమాంకంలో రామాయణ మహాకావ్యాన్ని అలతి అలతి పదాలతో కూడిన పద్యాలతో తెనుగీకరించాడు. అదొక అద్భుతం. బడి ముఖం కూడా చూడని ఒక పల్లెటూరి నాటు కవి అంత సాహసం చేయడం ఒక విచిత్రమైతే, దానికి పండితుల మెప్పు సాధించడం ఇంకా గొప్ప విశేషం. అందువల్లనే సత్యసాయి బాబా అంతటివాడు ఆయన్ను వేదిక మీద తన పక్కన కూర్చోబెట్టుకొని స్వయంగా సత్కరించాడు.

ఎమ్మెస్ రెడ్డి గారికి, జమీన్‌రైతుకు విడదీయరాని అనుబంధం. ఆయనలోని కవిత్వ పటిమను గుర్తించి, చిన్ననాడే పద్యాలు వ్రాయమని ప్రోత్సహించాడట జమీన్‌రైతు స్థాపకుడు స్వర్గీయ నెల్లూరు వెంకట రామానాయుడు. ఎమ్మెస్‌రెడ్డి చివరి క్షణం వరకు ఆ జ్ఞాపకాలను మధురంగా నెమరు వేసుకొనేవాడు. తనకు సహజ కవి అనే బిరుదు ఇచ్చింది కూడా జమీన్‌రైతు పత్రికే అని గర్వంగా చెప్పుకొనేవాడు. ఆయన పెదవి విప్పితే ఆసుకవిత్వం ధారాపాతంగా వెలికి వచ్చేది. ఆయన పద్యాల నిండా నాటు పదాలే. కానీ వాటిలో చెప్పలేని మాధుర్యం ఉండేది. ఆ పదాలతోనే ఆయన ఎన్నో సినిమా పాటలు కూడా వ్రాశాడు. ఉండేల మాల కొండారెడ్డి గారితో కలిసి నిత్య సాహిత్య యజ్ఞం నడిపేవాడు. ఎమ్మెస్ రెడ్డి గారితో ఒక నిముషం మాట్లాడినా ఒక పద్యం తప్పక వినవచ్చేది. సాహిత్యం అంటే అంత పిచ్చి ఆయనకు. మాటలకంటే పద్యాలతోనే పలకరించడం ఆయనకు ఇష్టం. చివరి దశలో ఆయన వ్రాసు కొన్న ఆత్మకథ చాలా వివాదాస్పదమైంది. సినీరంగంలో, రాజకీయరంగంలో చాలామంది మనసులు గాయపడతాయని తెలిసినా తన అనుభవాలను నిర్మొగమాటంగా వ్యక్తం చేశాడు అందులో.

కష్టపడి పైకి రావాలనుకొనే ప్రతి ఒక్కరూ ఎమ్మెస్ రెడ్డి గారి జీవితాన్ని ఒక పాఠ్యపుస్తకం వలె చదువుకోవడం ఉపయోగం. అంతగా జీవన సాఫల్యం చెందడం ఆయన పూర్వజన్మ భాగ్యం. ఆయన మరణం ద్వారా జమీన్‌రైతు ఒక ప్రీతిపాత్రమైన అభిమానిని కోల్పోయింది. వారి కుటుంబానికి మా సానుభూతి తెలియజేస్తున్నాము.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఏదోరకంగా తెలియజేస్తే కొందరైనా ఈ కార్యక్రమానికి హాజరయ్యేవారు. పూర్వ విద్యార్థుల చిరునామా విశ్వోదయలో లేకుంటే సేకరించే ప్రయత్నం చేయమనవి.

ప్రొఫెసర్ నాగరాజరావు హైదరాబాద్

### నిశ్శబ్దంగా పనిచేస్తున్న కలెక్టర్!

జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి బాధ్యతలు తీసుకొన్న రోజు నుంచి తనదైన ధోరణిలో పనిచేస్తున్నారు. ప్రతి విషయమై పరిజ్ఞానం పెంచుకోను జిల్లాలో విస్తృతంగా పర్యటించారు. దళితులు, బడుగు, బలహీనవర్గాల సంక్షేమానికి కృషి చేస్తున్నారు. సంక్షేమ హాస్టళ్లలో మౌలిక సదుపాయాల కల్పనకు ప్రవేశపెట్టిన స్వీకారం, పేదల విద్యార్థులకు కార్పొరేట్ విద్యను అందించను ఉద్దేశించిన సరస్వతి పథకాలు అభినందనీయాలు. ప్రజావిజ్ఞప్తులను పరిష్కరిస్తూ ఎస్‌సి, ఎస్‌టి బీడు భూముల సాగుకు ఆయన రూపొందించిన ప్రణాళికలు ప్రశంసనీయాలు. పేద వర్గాల సంక్షేమానికి కృషి చేస్తున్న కలెక్టర్ గారికి ప్రజలు మద్దతు పలకాలి.

ఎస్.బాబురావు కావలి

## జమీన్‌రైతు పోకడ మార్చలేవు!

16వ పేజీ కొరవ

పరువు నష్టం కేసులు దాఖలు చేయడం కాదు, ఆమె అసభ్య ప్రవర్తన వల్ల నెల్లూరు నగరపు మానమే మట్టి పాలౌతున్నది కాబట్టి, ప్రజలందరూ కలిసి ఆమె మీద పరువు నష్టం దావా వేయవలసిన అవసరం వుంది. న్యాయపరంగా అవకాశం వుంటే, ఆ విషయాన్ని పరిశీలించవలసిందిగా నెల్లూరు పుర ప్రముఖులను కోరుతున్నాము. ప్రజా ప్రతినిధుల నీచమైన రాజకీయ శైలిని ఎండగట్టడంలో 'జమీన్ రైతు' ఎంత మాత్రం వెనుకడుగు వేయదని పాఠకులకు మేము స్పష్టం చేయదలచాము. ఒక్క ఆనం వివేకానందరెడ్డి, భానుశ్రీల విషయంలోనే కాదు, జిల్లాకు సంబంధించిన ఏ రాజకీయవాది విషయంలోనైనా మా వైఖరి ఒకటిగానే వుంటుంది. జైలు శిక్షలతో మార్పు రాదు. రావలసిన అవసరమూ లేదు.

మేజిస్ట్రేట్ కోర్టులో తీర్పు వెలువడక ముందే ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి రొట్టెల పండుగ దర్గా దగ్గర విలేకరులను పిలిచి, తీర్పు రాబోతున్నది, ట్రోలింగ్ ఇవ్వడానికి సిద్ధంగా వుండండి అని ప్రకటించాడు. తీర్పు వచ్చిన రెండు నిముషాలలోనే, ఆ వార్త తానే చెప్పడంతో పాటు, స్వీట్లు పంచి సంబరం చేసుకొన్నాడు. ఎవరి ఆనందం వారిది.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

పోలీసులకు అప్పగించారు. వీరంతా తమిళనాడు రాష్ట్రం మధురై ప్రాంతానికి చెందిన వారిగా పోలీసులు అనుమానిస్తున్నారు.

### దర్గా హుండీ ఆదాయం 14.80 లక్షలు

రొట్టెల పండుగ సందర్భంగా దర్గా హుండీ ఆదాయం 14.80 లక్షలుగా అధికారులు లెక్కించారు. గత ఏడాది ఆదాయం 11 లక్షలు కాగా ఈ ఏడాది మూడు లక్షలు పెరిగింది. 10వ తేదీ దర్గా ఆవరణలో ఎమ్మార్వో, కమిటీ సభ్యులు హుండీలను లెక్కించగా ఈ మొత్తం వచ్చినట్లు ప్రకటించారు.

### టూరిజంకు ఆదాయం నాలుగు లక్షలు

రొట్టెల పండుగకు వచ్చి జనం చెరువులో టూరిజం వారు ఏర్పాటుచేసిన బోట్‌లో షికారు చేయడం వల్ల ఆ సంస్థకు నాలుగు లక్షల రూపాయలు ఆదాయం వచ్చినట్లు అధికారులు చెప్పారు.

### క్యాన్సర్ హాస్పిటల్‌కు భూరి విరాళం

రెడ్‌క్రాస్ క్యాన్సర్ హాస్పిటల్‌కు మద్రాస్ వాసి, కృష్ణాజిల్లా చల్లపల్లి జమీందారీ కుటుంబానికి చెందిన సుచరిత 25 లక్షల భూరి విరాళాన్ని అందజేశారు. డిసెంబర్ 8వ తేదీ జిల్లా కలెక్టర్ శ్రీధర్‌ను కలిసి ఈ మొత్తాన్ని అందించిన ఆమె తన భర్త హరిశ్చంద్రప్రసాద్ క్యాన్సర్‌తో మరణించడని, ఆయన స్మృత్యర్థం ఈ విరాళాన్ని అందజేస్తున్నట్లు ప్రకటించారు. జిల్లావాసి కాకపోయినా భూరి విరాళాన్ని అందజేసిన సుచరితను కలెక్టర్ శ్రీధర్ అభినందించారు.

### మూలపేటలో శ్రీధర్‌కు ఘన స్వాగతం

నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో 141 రోజుల పాదయాత్ర చేస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డికి మూలపేట, ఫత్తేఖాన్‌పేటల్లో ఘన స్వాగతం లభించింది. మూలపేటలోని గోల్డ్‌కింగ్ డీలర్ల కుటుంబీకులు, ఫత్తేఖాన్‌పేటలోని మాజీ కార్పొరేటర్ పిండి సురేష్ బంధువులు దగ్గరుండి ఈ యాత్ర జయప్రదమయ్యేట్లు చూడడం చర్చనీయాంశమయ్యింది.

### చెట్లు పెంచాలి

ప్రతి విద్యార్థి చెట్లు పెంచాలని జిల్లా కలెక్టర్ శ్రీధర్ పిలుపునిచ్చారు. అక్షర ఫౌండేషన్ ఆధ్వర్యంలో మనోహర్‌రెడ్డి చేపట్టిన నా చెట్టు అనే కార్యక్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ మొక్కలు నాటడంతోపాటు వాటి సంరక్షణ బాధ్యత చూడాలన్నారు. పర్యావరణ పరిరక్షణకు కృషిచేస్తున్న అక్షర ఫౌండేషన్ నిర్వాహకులను కలెక్టర్ అభినందించారు.

### మార్కెట్ తాతిరెడ్డి భార్య మరణం

ఏసి కూరగాయల మార్కెట్ కమిటీ అధ్యక్షుడు కోకు తాతిరెడ్డి సతీమణి అనసూయమ్మ 11తేది మరణించారు. తాతిరెడ్డి వ్యాపార, వ్యవసాయ రంగాలలో విజయం సాధించడానికి ఆమె ప్రోత్సాహం ఎంతో వుంది. ఆమెకు కుమారుడు, ముగ్గురు కుమార్తెలు. ఆత్మీయురాలిని కోల్పోయిన వారి కుటుంబానికి మా సానుభూతి.

# ఉరిశిక్షను రద్దు చేయాలని సదస్సు!

**నేరాలతో సంబంధంలేని వ్యక్తులను కేసుల్లో ఇరికించి ఉరిశిక్షలు విధించడంపై జార్ఖండ్ కళాకారుల ఉరిశిక్ష వ్యతిరేక కమిటీ, యుద్ధనేరాల జాతి నిర్మూలన వ్యతిరేక కమిటీ నేతృత్వంలో నెల్లూరు టౌన్‌హాల్‌లో సదస్సు జరిగింది.**

ఉరిశిక్షను వ్యతిరేకిస్తూ ఈనెల 6వ తేదిన నెల్లూరు నగరంలోని టౌన్ హాలులో బహిరంగసభ జరిగింది. జార్ఖండ్ కళాకారుల ఉరిశిక్ష వ్యతిరేక కమిటి, యుద్ధ నేరాల జాతి నిర్మూలన వ్యతిరేక కమిటీల ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి పౌరహక్కుల సంఘాల నేతలు, ఉద్యమకారులు హాజరయ్యారు. రాజీవ్‌గాంధీ హత్య కేసులో ఉరిశిక్షపడిన శంతన్, మురుగన్, పెరియరవన్‌లతోపాటు జార్ఖండ్ రాష్ట్రానికి చెందిన ఆదివాసి నాయకుడు కళాకారుడైన జితిన్‌మరాండి మరో ముగ్గురికి గిర్డి జిల్లా కోర్టు మరణశిక్ష విధించిన సంగతి తెలిసిందే.

నేరాలతో సంబంధంలేని వ్యక్తులను కేసుల్లో ఇరికించి ఉరిశిక్షలు విధించడంపై సభలో పాల్గొన్న వ్యక్తులు ఆందోళన వ్యక్తం చేశారు. ప్రస్తుతం దేశవ్యాప్తంగా ఉరిశిక్ష విధింపుపై చర్చ కొనసాగుతోంది. ఈ క్రమంలో అన్ని రాష్ట్రాల్లో ఉరిశిక్ష వ్యతిరేక కమిటీలను ఏర్పాటు చేసి సభలు, సమావేశాలు నిర్వహిస్తున్నారు. ఇందులో భాగంగానే నెల్లూరు నగరంలో సభను ఏర్పాటు చేసినట్లు నిర్వాహకులు చెప్పారు. సభకు ప్రధాన వక్తగా తమిళనాడు రాష్ట్రానికి చెందిన తమిళ జాతియోద్యమ నాయకుడు త్యాగు హాజరయ్యారు. రాజీవ్‌గాంధీ హత్యకేసులో ముగ్గురికి ఉరిశిక్ష విధించడాన్ని తమిళనాడు ప్రజలు వ్యతిరేకిస్తున్నారని ఆయన చెప్పారు.

అలాగే పార్లమెంటుపై జరిగిన దాడి కేసులో అఫ్జల్‌గురు ఉరిశిక్షను కూడా కాశ్మీర్ ప్రజలు వ్యతిరేకిస్తున్నారన్నారు. అమాయకులైన కళాకారులకు సైతం ఉరిశిక్షలు విధించి జీవించే హక్కును హరిస్తున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. "కంటికి కన్ను, పంటికి పన్ను" అనే మధ్యయుగాల నాటి ప్రతీకారేచ్ఛతో కూడిన శిక్షా విధానానికి నేడు కాలం చెల్లిందని వివరించారు. నేరం–శిక్షకు సంబంధించి మానవీయ కోణం నుంచి ఎన్నో సంస్కరణవాద ఆలోచనలు ముందుకు వచ్చాయని గుర్తు చేశారు. న్యాయవాది చంద్రశేఖర్ మాట్లాడుతూ నేడు భారతదేశ వ్యాప్తంగా పేదప్రజలపై అనేక దాడులు చేసిన వారికి సాధారణ జైలు శిక్ష పడడం లేదన్నారు.

ఇందిరాగాంధీ హత్యానంతరం పంజాబ్‌లో సిక్కుల మీదకు జనాన్ని రెచ్చగొట్టి హత్యలు చేయించిన కాంగ్రెస్ నాయకులను కోర్టులు నిర్దోషులుగా ప్రకటించాయన్నారు. అలాగే కారంచేడు, చుండూరు మారణకాండకు కారకులైన ఒక్కరికి కూడా ఉరిశిక్షలు వేయలేదన్నారు. సంఘటిత ఆర్థిక నేరాలకు మన చట్టాల్లో ఉరిశిక్షలు లేవన్నారు. ప్రభుత్వ ఆస్తులు, ప్రకృతి వనరులను దోచుకుంటూ వేల కోట్ల రూపాయలను కొల్లగొడుతున్న రాజకీయ మాఫియాలు శిక్షల నుంచి తప్పించుకుంటున్నారన్నారు. అందరికి ఉరిశిక్షలు వేయమని తాము చెప్పడం లేదని ధనవంతులు, మాఫియాలను ప్రభుత్వాలు, కోర్టులు ఏం చేయలేవని నిర్ధారణ జరిగిందన్నారు. చట్టం, న్యాయస్థానాల పట్ల ప్రజలకు విశ్వాసం పోతుందన్నారు.

నేరాలు నిరోధించడానికి ఉరిశిక్ష సరైన శిక్ష కాదన్నది తమ అభిప్రాయమని చెప్పారు. ఈ మధ్య ప్రభుత్వం విడుదల చేసిన నివేదికలో నేరాల శాతం బాగా పెరిగిందని వెల్లడైంది. వ్యవస్థ స్వభావాన్ని బట్టి నేరాలు జరుగుతుంటాయి. అంతేకాకుండా పెట్టుబడిదారి సమాజంలో నేరాలు పెరిగే అవకాశం కూడా వుంటుందని సభకు అధ్యక్షత వహించిన ఎన్.పురంధర్ అభిప్రాయపడ్డారు. ఒకవైపు సంపన్నులు మరింత సంపన్నులుగా, మరోవైపు పేదలు మరింత నిరుపేదలుగా మారుతున్న ఆర్థిక విధానంలోనే నేరస్వభావం దాగి వుందన్నారు. ఉరిశిక్షల రద్దుకై జరుగుతున్న ఆందోళన ప్రతిఒక్కరు భాగస్వాములు కావాలని విజ్ఞప్తి చేశారు.

ఈ కార్యక్రమానికి రాజీవ్‌గాంధీ హత్య కేసులో ఉరిశిక్షపడిన పెరియవన్ తల్లి అమ్మాళ్ హాజరయ్యారు. తమ కుమారుడు ఉరిశిక్ష నుంచి బయటపడతాడన్న నమ్మకం వుందన్నారు. ఇందుకోసం తాను అహర్నిశలు ప్రయత్నాలు చేస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో పౌరహక్కుల సంఘం ఉపాధ్యక్షుడు డి.సురేష్‌కుమార్, పొన్నుస్వామి, వివిధ ప్రజా సంఘాలకు చెందిన నేతలు పాల్గొని ప్రసంగించారు.

# రేషన్ డీలర్లపై క్రిమినల్ కేసులు!

**● రూపాయికి కిలో బియ్యం పథకంలో అక్రమాలు ఆపే యత్నం**

రూపాయికే కిలో బియ్యం పథకంలో అక్రమాలకు పాల్పడితే రేషన్ షాపు డీలర్లపై క్రిమినల్ కేసులు నమోదు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ మేరకు జిల్లా పౌరసరఫరాల శాఖకు ఆదేశాలందాయి. లబ్ధిదారులకు అందాల్సిన సబ్సిడీ బియ్యం, ఇతర సరకులు ప్రక్కదారి పడుతున్న సంగతి తెలిసిందే. ఈ క్రమంలో ఈ పథకంపై అనేక ఫిర్యాదులు అందడంతో ప్రధానంగా రేషన్‌షాపు డీలర్లపై ఆరోపణలు రావడంతో ప్రభుత్వం పై నిర్ణయం తీసుకోవాల్సి వచ్చింది. పౌరసరఫరాల శాఖ నుంచి మండల తహశీల్దార్లు నిఘా ఉంచాలని సమాచారం వెళ్లింది. ఇప్పటివరకు పట్టుబడిన రేషన్ బియ్యం తరలించేందుకు కారకులైన వారిపై కూడా క్రిమినల్ కేసులు నమోదు చేయాలన్న ఆలోచనలో ఉన్నారు.

# మల్లెమాలకు మల్లెమాల!

## సహజ కవి ఎమ్మెస్‌రెడ్డితో జయంపుకృష్ణ అనుభవాలు!

1972లో నేను నెల్లూరులో బియిడి చదువుతున్నాను. అదే సంవత్సరం నా మొదటి నవల "ప్రేమ పూజారి" ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో సీరియల్‌గా వచ్చింది. నాకు రచయితగా ఎనలేని ముద్రవేసింది. ఎంతో పేరు తెచ్చింది. ప్రముఖ సినీ నిర్మాత, కవి మల్లెమాల సుందరరామిరెడ్డి(ఎమ్మెస్‌రెడ్డి) గారిది మా ఊరు దగ్గర 'అలిమిలి' అనే గ్రామం. నా నవల, నా పేరు ఆయన చెవిన పడ్డాయి. వెంటనే నా గురించి ఎంక్వైరీ చేశారు. వారి పక్క ఊరి అబ్బాయినని తెలుసుకుని నన్ను వచ్చి మదరాసులో కలవమని కబురు చేశారు. ఉద్యోగాన్వేషణలో ఉన్న నేను వెళ్లి ఆయన్ను కలిశాను.

ఉదయాన్నే కౌముదీ పిక్చర్స్ ఆఫీసు చేరుకున్నాను. తెల్లని వలువల్లో బయటకు వచ్చారు ఆ ఆజానుబాహుడు. "నా పేరు కృష్ణ, ఊరు జయంపు" అని పరిచయం చేసుకున్నాను నమస్కరిస్తూ. ఆయన ఆశ్చర్యపోతూ నమ్మలేనన్నట్లు చూశారు నా వంక. "జయంపు



కృష్ణ అంటే నువ్వేనా? ఏందయ్యా? ప్రేమ పూజారి అనే సీరియల్ రాసింది నువ్వేనా? ఆంధ్రప్రభలో వచ్చిన ఆ సీరియల్ నీదేనా?" అంటూ మా ఊరి యాసలో, నెల్లూరు భాషలో అడిగారు. "నేనే సార్!" సవినయంగా అంటూ, పత్రికవారు నాకు ప్రేమ పూజారి నవలకు పంపిన రెమ్యునరేషన్ చెక్కుతీసి చూపించాను. "అది సరేగానీ! నువ్వు నా దగ్గర పనిచేస్తావా? నెలకు మూడొందల జీతం యిస్తా. ఇంక్రిమెంటు యివ్వను. అడ్వాన్స్ అడక్కూడదు. షూటింగ్స్ అప్పుడు అందరితోపాటు నీకు బేటాలు యివ్వను. అప్పు చేయకూడదు. మద్యం ముట్టకూడదు. వెధవ్వేషాలు వెయ్యకూడదు. నువ్వు మీ వాళ్లకు ఒక్కడివే కొడుకువని నాకు తెలుసు. అర్థమయిందా? అట్లా నువ్వు నా దగ్గర ఆర్నెల్లు పనిచేశావంటే ఆ తరువాత ఆలోవర్ ఇండియాలో ఎక్కడయినా బతికిపోతావ్ సరేనా?" అంటూ చెప్పారు నిక్కచ్చిగా, నిర్మొగమాటంగా. "అలాగే సార్!" ఒప్పుకున్నాను నేను. అలా కౌముదీ పిక్చర్స్‌లో నేను ప్రవేశించాను. స్క్రిప్ట్ మరియు డైరక్షన్ సెక్షన్స్‌లో ఎమ్మెస్‌రెడ్డి గారు చెప్పిన కండిషన్స్‌కు లోబడి ఆయన దగ్గరే ఆరేళ్లపాటు సాలిడ్‌గా పనిచేయడం జరిగింది. నేను వెళ్లిన కొత్తల్లో నన్నో సినిమా కథ రాసుకురమ్మని మా ఊరు పంపించారు. నేను అలాగే వెళ్లి రెండు వారాల్లో "జడ కుచ్చులు" అనే రంగురాళ్ల పరిశ్రమ బ్యాక్‌డ్రాప్‌తో ఓ మాంచి ప్రేమకథ రాసుకువచ్చాను. అదివిని నన్ను మెచ్చుకున్నారు. పత్రికలో ఆ సినిమాకు సంబంధించిన ప్రకటన కూడా ఇచ్చారు. ఆ ప్రకటనలో పైన కౌముదీ పిక్చర్స్ "జడ కుచ్చులు" అని కింద కథ : జయంపు కృష్ణ, రచన : మల్లెమాల అని వేయించారు. అదిచూసిన ఓ నిర్మాత మా ఆఫీసుకొచ్చి "టైటిల్ చాలా బావుంది, ఏమిటా కథ? ఎవరు రాశారు?" అని రెడ్డిగారిని అడిగాడు. టూకీగా ఆ కథను గురించి ఆయనతో ముచ్చటించి ఆయనకు నన్ను పరిచయం చేశారు. "మా ఊరి పిల్లోడే. చాలా బాగా రాశాడు" అంటూ. వెంటనే ఆ నిర్మాత అదే కథను కొద్దిగా మార్చి బ్యాక్‌డ్రాప్‌ను వేరే తీసుకొని "జడ గంటలు" అనే పేరు మీద సినిమా తీసి రిలీజ్ చేశాడు. అలా "జడ కుచ్చులు" సినిమా ఆగిపోయింది.

ఆ తర్వాత నాకు గవర్నమెంట్ ఉద్యోగం రాగానే స్కూల్ అసిస్టెంట్(సైన్స్)గా వెళ్లిపోయాను. అయినా అప్పుడప్పుడూ రెడ్డిగారు వారి దగ్గరకు పిలిపించుకునేవారు స్క్రిప్ట్ డిస్కషన్స్ కోసం. అప్పుడే "రామబాణం" అనే సినిమాకు కథరాసే అవకాశం నాకు ఇచ్చారు మళ్లీ. "రామబాణం" సినిమాకు కథ రాశాను. నా పేరున టైటిల్ కార్డ్ వేశారు. శోభన్‌బాబు – జయప్రద, కృష్ణంరాజు – లత తారాగణం. విజయవంతం అయింది. అలా "ఏకలవ్య" సినిమా వరకూ పనిచేశాను మరో నాలుగయిదేళ్లు. ఆ తర్వాత వారు హైదరాబాద్ షిఫ్ట్ అవడంతో మా కలయికకు అంతరాయం ఏర్పడింది. అయినా నేను ఏదో ఓ పనిమీద హైదరాబాద్ వెళ్తే వారిని కలవకుండా, చూడకుండా వచ్చేవాడిని కాదు. ఇక్కడో ముఖ్య విషయం ప్రస్తావించక తప్పదు. రెడ్డిగారికి ఇద్దరమ్మాయిలు, ఒక్క కుమారుడు. ఆ కుమారుడే నేటి "అరుంధతి" నిర్మాత, తెలుగు జేమ్స్ కామెరూన్‌గా ప్రశంసలు అందుకున్న మల్లెమాల శ్యాంప్రసాద్‌రెడ్డి. నేను కాలేజి వదిలి, మదరాసు ఫిలింఫీల్డ్‌లో అడుగుపెట్టినప్పుడు శ్యాంబాబు అప్పుడే కాలేజిలో ప్రవేశించాడు. అలా మేమిద్దరం మంచి మిత్రులమయ్యాము. ఆయన అమెరికాలో చదువుకునేందుకు వెళ్లినా మా స్నేహం ఆగలేదు. ఉత్తరాలు రాసుకొనేవాళ్లం. గ్రీటింగ్స్ పంపుకునే వాళ్లం. అయినా ఆయన కృష్ణుడు. నేను కుచేలుణ్ణి. అంతే!

శ్యాంబాబు పెద్దమ్మాయ్ ఇంజనీరింగ్ చేసి టీవీ సీరియల్స్ తీయాలనే నిర్ణయానికొచ్చింది. వెంటనే శ్యాంబాబు నన్ను పిలిపించాడు హైదరాబాద్. పాపతో కలిసి ఆ పని నాకు అప్పగించాడు 2007లో. ఈ టీవీలో మా మొదటి సీరియల్ "శ్రావణ మేఘాలు", రెండవ సీరియల్ "తూర్పువెళ్లే రైలు". ప్రస్తుతం ఈటీవీలో ప్రసారమౌతున్న మా మూడవ సీరియల్ "మనసు మమత" విజయవంతంగా ప్రసారమవుతూ ఉంది.

ఎమ్మెస్‌రెడ్డిగారికి చనిపోయేనాటికి 87 సంవత్సరాలు. ఆయన తన చిత్రాల ద్వారా ఎన్నో మధురమైన పాటలు అందించిన అక్షర తపస్వి. అవిశ్రాంతంగా రచనలు చేస్తూ "మల్లెమాల రామాయణం" అందించారు. "ఇది నా కథ" అంటూ ఆయన ఆటోబయోగ్రఫీ రూపొందించారు. ఆయన ఏ లోకంలో ఉన్నా ఆయన ఆశీస్సులు నాకు అందుతూనే ఉంటాయి. అందుకే అపరిమళభరిత "మల్లెమాల"కు కృతజ్ఞతాపూర్వకంగా నా ఈ "మల్లెమాల".

## నెల్లూరు నగరం పరువు తీస్తున్న ప్రజా ప్రతినిధుల సరసాలు...



నెల్లూరు చెరువులో ఒకరి మీద ఒకరు నీళ్లు చల్లుకొంటున్న ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, మాజీ మేయర్ భానుశ్రీ. భార్య కాని పరాయి స్త్రీతో ఒక పురుషుడు ఇటువంటి సాన్నిహిత్యం ప్రదర్శించడం ఎక్కడి సంస్కారం? ప్రజా ప్రతినిధులుగా వుంటూ బహిరంగ ప్రదేశాలలో, అది కూడా రొట్టెల పండుగ వంటి పవిత్ర స్థలాలలో అసభ్యంగా సరసాలాడుకోవడం ఎట్లా సమర్థనీయం?

## జైలు శిక్షలు, జరిమానాలు

# జమీన్‌రైతు పోకడ మార్చలేవు!

- భానుశ్రీ పరువు నష్టం కేసులో జమీన్‌రైతు సంపాదకుడికి జైలు శిక్ష.
- న్యాయమూర్తి తీర్పు అసంతృప్తి కల్గించింది.
- ఆ తీర్పులో చాలా లోపాలు, పొరపాట్లు వున్నాయి.
- అందుకే పైకోర్టుకు అప్పీలుకు వెళ్తున్నాము.
- ఇతరత్రా న్యాయమార్గాలనూ వదలదలచుకోలేదు.

మాజీ మేయర్ నందిమండలం భానుశ్రీ దాఖలు చేసిన పరువు నష్టం కేసులో 'జమీన్‌రైతు' సంపాదకుడికి ఆరు నెలల సాధారణ ఖైదు, రెండువేల రూపాయల జరిమానా విధిస్తూ తీర్పు చెప్పారు రెండవ అదనపు జ్యుడీషియల్ మేజిస్ట్రేట్ శ్రీమతి మాధవీకృష్ణ. 9తేది మధ్యాహ్నం తన తీర్పును ప్రకటించారామె. భానుశ్రీని ఉద్దేశించి వివిధ సందర్భాలలో 'జమీన్‌రైతు'లో వాడిన "ఇష్టసఖి", "ఇష్టురాలు", "ప్రియ నేస్తం", "మురిపాలు" వంటి పదాలు ఆమె పరువుకు భంగం కల్గించినట్లుగా న్యాయమూర్తి అభిప్రాయపడ్డారు. పత్రికలను సాధారణ ప్రజలు చదువుతారు, వారి అవగాహన ప్రకారం పదాలను వినియోగించడం సంపాదకుడి బాధ్యత, ఇష్టసఖి, ప్రియనేస్తం వంటి పదాలను అర్థాలు ఏవైనా, ఈ కేసు విషయంలో వాటిని వాడిన తీరును బట్టి ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డికి భానుశ్రీ సన్నిహిత స్నేహితురాలు అనే భావం స్ఫురిస్తున్నది కాబట్టి, అది ఆమె పరువుకు భంగమని తీర్పు చెప్పారు న్యాయమూర్తి. ఇటువంటి పదాల అవసరం లేకుండా కూడా వార్తలు వ్రాయవచ్చునని, ఒక మహిళకు సంబంధించిన అంశంలో ఆ జాగ్రత్త పాటించాలని హితవు చెప్పారు న్యాయమూర్తి. స్త్రీ వ్యతిరేక రచనలను నిషేధించాలని, అసభ్యతకు తావివ్వకూడదని అభిప్రాయపడ్డారు.

అయితే మాధవీకృష్ణ గారిచ్చిన ఈ తీర్పు, మాకు తీవ్రమైన అసంతృప్తి కల్గించిందని చెప్పక తప్పదు. ఈ తీర్పు ద్వారా మాకు న్యాయం జరగలేదని చెప్పడానికి సందేహించడం లేదు. అందువల్లనే అదే న్యాయమూర్తి ఇచ్చిన అవకాశాన్ని వినియోగించుకొని పైకోర్టులో అప్పీలు దాఖలు చేస్తున్నాము. తీర్పు ప్రతి చదివితే చాలా లోపాలు కన్పిస్తున్నాయి. కోర్టు సాంప్రదాయాలకు భిన్నంగా అందులో కొన్ని వ్యాఖ్యలు, వాక్యాలు వున్నాయి. కేసుకు ఆధారంగా న్యాయమూర్తి పేర్కొన్న చట్టపరమైన సెక్షన్లలో కూడా పొరపాట్లు దొర్లాయి. సంపాదకుడిగా నేను అనని మాటలు అందులో చేర్చారు. ఫిర్యాదిగా భానుశ్రీ చెప్పని కోణం నుంచి కూడా న్యాయమూర్తి కేసును పరిశీలించినట్లు తీర్పు చదివితే అర్థమౌతున్నది. వీటన్నిటి వల్ల సంపాదకుడిగా నాకు జరిగిన నష్ట నివారణకు న్యాయపరంగా ఎటువంటి ఉపశమనాలు అందుబాటులో వున్నాయో తెలుసుకొనేందుకు న్యాయ నిపుణులతో సంప్రదింపులు జరుపుతున్నాము. ఒక స్పష్టత ఏర్పడిన తర్వాత వాటిని పాఠకులకూ వివరించి చెప్తాము.

ఒక్కటి మాత్రం నిజం. జైలు శిక్షలు, జరిమానాలకు 'జమీన్‌రైతు' వెరవదు; పాఠకులకు వాస్తవ సమాచారం, నిఖార్సైన వ్యాఖ్యానం అందించడంలో తన పోకడ మార్చుకోదు. ఆ కోణంలో రాజీ ప్రసక్తే లేదు. భానుశ్రీ, వివేకానందరెడ్డిల వికృత పోకడలవల్ల నెల్లూరు జిల్లా రాజకీయాలు ఎంతగా రోతపట్టి పోతున్నాయో ప్రజలందరికీ తెలుసు. బహిరంగ ప్రదేశాలలో వారు సరసాలాడుకోవడం జగమెరిగిన వాస్తవం. ఏ పత్రికలో ఏ రోజు ఏ ఫోటో చూసినా, ఏ టీవీలో ఏ దృశ్యం చూసినా ఆ నిజం అర్థమౌతుంది. ప్రజా ప్రతినిధులుగా వుంటూ వారిద్దరూ చేస్తున్న వికారపు చేష్టల వల్ల నెల్లూరు నగరం పరువు మంట కలిసి పోతున్నది. బయట జిల్లాలకు చెందిన రాజకీయవాదులు, పత్రికలు చదివే పాఠకులు, టీవీలు చూసే సాధారణ ప్రేక్షకులు కూడా నెల్లూరు నగరం గురించి, ఇక్కడి రాజకీయవాదుల గురించి చులకనగా మాట్లాడుకోవడం అలవాటై పోయింది. నెల్లూరు జనానికి సిగ్గన్నది లేదా, ఇటువంటి అసభ్య ప్రవర్తనను ఎట్లా సహిస్తున్నారని కనిపించిన ప్రతిఒక్కరూ అడుగుతున్నారు. నిజం చెప్పాలంటే, భానుశ్రీ తన పరువు పోయిందని పత్రికల మీద

కొరవ 14వ పేజీలో



ముత్తుకూరు మండలం కుమ్మరమిట్ట మాజీ సర్పంచ్ స్వర్గీయ దువ్వూరు గోపాలకృష్ణారెడ్డి, శకుంతలమ్మ మనుమడు, వైజాగ్ స్టీల్ అధినేత దువ్వూరు విజయకుమార్‌రెడ్డి, రేఖల కుమారుడు అభిషేక్, దండిగుంట వెంకురెడ్డి మనుమరాలు, నూకలపాటి శ్రీధర్‌రెడ్డి, గీతల కుమార్తె విజ్ఞత వివాహం ఈ నెల 4తేది నెల్లూరు అనిల్‌గార్డెన్స్‌లో వైభవంగా జరిగింది.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com